## Bibliographic Record Target

మౌలానామహమ్మదాలీ జీవితము.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1923.

70, (2) p. ;16 cm.

Record no. 655

Maulānāmahammadālī jīvitamu.- Cennapuri : Vāviḷla Rāmasvāmiśāstrulu aṃḍ Sans, 1923.

70, (2) p. ;16 cm.

Record no. 655

వందేమాతరమ్.

అల్లాహోఅగ్బర్.

# మౌలానామహమ్మదాలీజీవితము.





చెన్నపుర:

వావిళ్ల, రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1923

PRINTED
AT THE 'VAVILLA' PRESS,
MADRAS.-1923.

వందేమాతరమ్.

అల్లాహోఅగ్బర్.

# మౌలానామహమ్మదాలీజీవితము.

---

శ్లో. "కదర్థితస్యాపి హి ధైర్యవృత్తే
ర్నశక్యతే ధైర్యగుణః ప్రమార్ష్టుమ్,
అధోముఖస్యాపి కృతస్యవహ్నే
ర్నాధ శ్శిఖాయాతి కదాచి దేవ."

(భర్తృహరి.)

భారతమాత నుద్ధరించుటకు ప్రస్తుతకాలమున వారువీరనక భారతపుత్త్రు లనేకులు ఒనరించుచుండు మహాఆత్మత్యాగమును వేనోళ్ల పొగడినను చాలియుండదని తెలిసియు, ఈచిన్నగ్రంథమున అట్టియాత్మత్యాగము నొనరించినవారును, మహమ్మదీయ నాయకాగ్రగణ్యుం డనదగు మౌలానా మహమ్మదాలీగారి జీవితమును వెల్లడించుటకు ప్రయత్నించితిమి. అంతేగాక మౌలానామహమ్మదాలీజీవితమును వ్రాయునప్పుడు దానితో మౌలానాషౌకతాలీజీవితమునుకూడ చేర్చియే చెప్పవలసియున్నది. శ్రీకృష్ణచరిత్రమును వ్రాయబూనినప్పుడు బలరాముని చరిత్రమును చెప్పనిచో నెంతరసహీనమగునో అటులే ఈసోద

రులలో నెవరిజీవితమును వ్రాయజాలినను మఱియొకరిది విడుచుటకు వీలులేదు. రామకృష్ణులనామములనెట్లు జతగాగూర్చి భాగవతులు స్మరింతురో అట్లే వీరును ఈకాలమున అందఱుచే ఆలీసోదరులను జతగాస్మరణకువచ్చుచున్నారు. అయినను ప్రస్తుతము వీరిరువురిలో మౌలానామహమ్మదాలీగారిజీవితమునే సంక్షేపముగా వ్రాయుటకు యత్నించెదము.

## వంశము.

గాంధిమహాత్మునివలెనే ఆలీసోదరులును భారతదేశమునందొకస్వదేశసంస్థానమునకు సంబంధించినవారు. వీరిపితామహులు అనాదినుండి మొరడాబాదుకాపురస్థులు. వీరితాత ఆలీబక్షుఖానుఁడు మిక్కిలిసంపన్నుఁడు. రాంపూరుస్వదేశసంస్థానమునందీతఁడు గౌరవనీయమగు ఉద్యోగమును చేసినవాఁడు. వేయేల? రాంపూరు సంస్థానాధీశుఁడగు యూసఫుఆలీఖానునకు ఆలీసోదరులపితామహుఁడు కుడిభుజమైయుండెను. 1857-వ సంవత్సరములో జరిగినసిపాయిలతిరుగుబాటప్పుడు బ్రిటీషు వారగు మనపాలకులకు ఈతఁడు మిక్కిలి సాయపడియుండెను. ఈతఁడొనర్చినయుపకారమునకు ప్రత్యుపకృతిగా యూసఫుఆలీఖానుఁడు—ఈతని నేఖానీసమరందురు—మొరడాబాదుజిల్లాలో బ్రిటీషుదొరతనమువారి స్వాధీనములో నుండిన మిక్కిలివైశాల్యముగల నొకజాగీరును పేష్కస్తి వజా చేసియొసంగిరి. యూసఫుఆలీఖానుఁడు ఈబహుమతిచే సంతసించినవాఁడై తన్ను ఇంతటిగౌరవాస్పదునిగా నొనర్చిన తనమంత్రియగు ఆలీబక్షుఖానునకు విశేషముగా సన్మానములొసంగియుండెను. మన ఆలీ



సోదరులతండ్రి అబ్దుల్ ఆలీఖానుఁడు. రాంపూరుసంస్థానమునందు గొప్పపదవి నలంకరించి కీర్తియుతుఁడైయుండెను. కాని, ఈతఁడు తన 27-వ వయస్సునందు గ్రహణిజాడ్యమునకు బలియై అకాలమరణమును బొందెను. తమతండ్రి పరలోకగతుఁడైనప్పుడు మౌలానా షౌకతాలీగారు 2 ఏండ్లబాలుఁడు. మహమ్మదాలీ చంటిబిడ్డ. కావున నీకాలమునకు మహనీయులైన ఈఇరువురుసోదరులును అనాథయగుతల్లిచే సంరక్షితులైరి. ఆమెయు తన కెన్నికష్టములు సంప్రాప్తించినను తనబిడ్డలను విద్వాంసులనుగాజేయుటయే ముఖ్యోద్దేశ్యము గలిగియుండెను.

## విద్యార్థిదశ.

ఏవిధముననైనను తనకుమాళ్లను విద్వాంసులనుగచేసి ధన్యతఁబడయవలయునని ముఖ్యముగా బైఅమ్మగారు—(ఆలీసోదరులతల్లి)—తలంపుగొని సమీపబంధువులు ఎన్నియాటంకములు చెప్పినను వినక తనబిడ్డలను ఆలీఘరుకళాశాలకు విద్య నేర్చుటకుఁ బంపెను. తనచేతికాసంతయు వీరివిద్యకుగాను బైఅమ్మగారు వెచ్చించిరి. కుమాళ్లు కాలేజివిద్యనుచదివి కృతార్థులై పట్టములనందిరి. ఇట్లు ఈవీరమాత తనకుమాళ్లకు తోడునీడగా తనభర్త మరణించినది మొదలు వారికి కష్టములు సంప్రాప్తించి చింద్వారాలో వారిని నిర్బంధించియుండినప్పుడు సైతము వారియొక్క విద్యుక్త కార్యములకు సలహాలనొసంగుచు తాను చింద్వారాలోనే యుండెను. ఈమె స్త్రీయైనను ఈమెకు ఇస్లాముమతముపై నుండుఅభిమానము బిడ్డలపై సైతము లేదని

చెప్పవచ్చును. మతమునకుగాను బిడ్డలనైనను త్యజించునంతటి మతావేశముగల ధీరురాలు.

### ఇంగ్లాండునకేగుట.

సోదరులిరువురును ఆలీఘురుకళాశాలలో తోటివిద్యార్థిరంజకులుగనుండిరి. తోటివిద్యార్థులు వీరిని గొప్పగా భావించుచుండిరి. కళాశాలలో నేయుద్యమమును ప్రారంభించినను ఈసోదరులలో నొక్కఁడు దానికి నాయకుఁడై యుండితీరును. ఆలీఘురుకళాశాలలో విద్యార్థికాలము నిట్లు ప్రకాశమానమైనదిగ నొనర్చి మౌలానామహమ్మదాలీ విశేషవిద్యను గడించుటకు ఇంగ్లాండునకేగి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయపువిద్యార్థియయ్యెను. మహమ్మదాలీయొక్క మేధాతిశయమునకు అచ్చెరువుపడి రాంపూరుప్రధానమంత్రి నవాబ్ మహమ్మద్ ఇసాహక్ ఖాను మహమ్మదాలిని ఇంగ్లాండునకు ఐ. సీ. యస్ పరీక్షయందుత్తీర్ణుడగుటకు ఇంగ్లాండునకు పంపుటకు కారకుఁడయ్యెను. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయములో సాహిత్యవిద్యకే తనకాలమునంతయు వినియోగించుచుండినందున మౌలానామహమ్మదాలీగారు ఐ. సీ. యస్సునందుత్తీర్ణుఁడు కాలేకపోయెను.

### మౌలానాషౌకతాలీ.

మౌలానాషౌకతాలీగారు ఆలీసోదరులలో జ్యేష్ఠుఁడు. ఆలీఘురుకళాశాలలో వీరిని సహపాఠకులు మిక్కిలి ప్రేమించియుండురు. ఈయన వ్యాయామములయందు మిగుల ఆసక్తిని చూపుచుండెను. చెండాట-క్రికెట్టు- వీరి కిష్టమైనది. ఆతని



విద్యార్థికాలమున చెండాటలో నగ్రేసరుఁడై కీర్తిగాంచియుండెను.

ఆలీఘురుకళాశాలచదువు పూర్తియై పట్టభద్రుఁడైనపిదప ఈమహనీయుఁడు ఉద్యోగమును సంపాదించుకొని జీవికను గౌరవముగా నడుపుకొనవలసినవాఁడాయెను. ఆక్సుఫర్డునందు విద్య నభ్యసించుటకు పోయిన సోదరునకు ధనము నందియ్యవలసినందున తాను నౌకరుచేయుట కియ్యకొనెను. ఈమహనీయుఁడు తనసోదరునిపై పుత్త్రునిజూచి యానందించునట్లు ఆనందించును. మహమ్మదాలీగారు ఏసభయందుగాని ఒకగంభీరోపన్యాసమును గావించుచుండునపుడు ఆతనిమోమునుజూచుచు చిఱునవ్వునవ్వుచుండును.

సహాయనిరాకరణోద్యమమునకు ప్రాణదాత మౌలానాషౌకతాలీయనినచో అయథార్థముకానేరదు. ఈయుద్యమముయొక్క ప్రారంభమునందే గాంధిమహాత్ముఁడు ఈమహనీయునియందు దాగియున్నమహిమను దెలిసికొని ఆతనియందు దృఢవిశ్వాసమును గలిగియుండెను. గాంధిమహాత్మునకు దేశమునందు సహాయనిరాకరణోద్యమమును స్థిరముచేయుటకు షౌకతాలియే ఊతకఱ్ఱ. హిందూమహమ్మదీయనాయకులను ఈమహోద్యమమునకుగాను ఏకీభావమును గలిగించునట్లు చేసినదే మౌలానాషౌకతాలీగారిశక్తి. మహమ్మదీయులతట్టు షౌకతాలీగారు తాను నిలచి హిందూమహమ్మదీయఐక్యమునకు కారణభూతుఁడైయుండెను. ఈతఁడతిదీర్ఘమును స్థూలమును నగుకాయముగలవాఁడు. ఇంతటి దీర్ఘస్థూలకాయుఁడు ఈఉద్యమవిషయ

మునచూపిన చుఱుకుదనము, కార్యపట్టుదల, సమయోచితమైననేర్పు అందఱకును వింతగొల్పును.

దాక్షిణ్యరాహిత్యమగు సహాయనిరాకరణోద్యమప్రచారమునకుగాను భారతదేశములో ఈమహనీయుఁడు సంచరింపని పట్టణముగాని పల్లెగాని యుండనేరదనియే యనవలయును. తా నెచ్చోటికేగినను అచ్చటివారిని యాకర్షించి వెంటనే వారిని తనప్రియమిత్రులనుగా జేయుఅద్భుతశక్తియొకటి వీరియందు గలదు.

ఈమహనీయునకు తనసోదరునిపై గల గాఢమగుప్రేమ, నాయకునకు విధేయత ఈరెండుగుణములును మూర్తీభవించియున్నవి. ఈతఁడు కర్మయోగి. ఉపన్యాసములేమియు గావింపనేరఁడు. ఎప్పుడైనను మాటలాడినచో నిర్భయత్వమును, నిష్కాపట్యమును రెండును ముఖమున తాండవమాడుచుండును. సోదరులిరువురును 'సత్యమేవజయతి' యని సత్యమునే నమ్ముకొని, సత్యవిజయమునకు ఎంతకష్టమునైనను ఓర్చి, ఎంతత్యాగమునకైనను వెనుదీయని దృఢమనస్కులు. కరాచీన్యాయస్థానమునందు వీరిపై నేరారోపణలు కోర్టువారు చేయుచుండగా ప్రతినేరమునకు కోర్టువారినే ప్రమాణమునుగోరుచు తికమకలను జేసిరి. తమయమోఘమైన ప్రాణములనుసైతము తమ ఇస్లాముమతమునకును, దేశమునకును అర్పణచేయగలశూరులీసోదరులు.

సోదరులిరువురును తమదేశమునకు, ఇస్లాముమతమునకు యథార్థముగా ఆత్మసమర్పణముచేసిన మహాత్యాగులు. మౌలానా



షౌకతాలీగారు తన కాలమునంతయు నమాజుచేయుటలోను ఇస్లామువేదగ్రంథము ఖొరానుపఠనములోను గడపువారట!

### మౌలానామహమ్మదాలీగారు, బరోడాసివిలుఉద్యోగము.

1902-న సంవత్సరములో ఇంగ్లాండునందుండి మౌలానామహమ్మదాలీగారు ఇండియాకేతెంచిరి. కొంతకాలము ఇండియాలో నున్నప్పుడు రాంపూరు కోశాధికారిగానుండెను. మరల ఇంగ్లాండునకు పరీక్షార్థమేగియుండి అచిరకాలమునందే భారతదేశమును జేరెను. అలహాబాదు విశ్వవిద్యాలయమున ఉన్నతన్యాయస్థానపరీక్షకు హాజరై అందు జయమునుబొందలేదు. పిదప బరోడాలో సంస్థానములయొక్క పరిపాలనశాఖలో ఉద్యోగమును సంపాదించి గొప్పపదవిలోనుండెను. ఈకాలమునందు వీరు నల్లమందుశాఖలో పనిచేసి సంస్థానమునకు 17 లక్షలఆదాయమును వృద్ధిచేసెను. మహారాజావారు మహమ్మదాలీయొక్క నిపుణతకు, దూరదృష్టికి సంతోషించి ఈయనయెడల నౌకరుభావములేక అసమానమగు ప్రతివిశ్వాసములుఁగలిగి వర్తించుచుండెను.

ఈమహనీయుని మహామేధయథేచ్ఛగా విస్తరించుటకుబరోడాచాలినంతవైశాల్యముగలిగినది కానేరదు. సంస్థానోద్యోగము ఈతని మేధకు అత్యల్పమైనది ఏపనిచేసినను లోకమంతయు మెచ్చునట్లు చేయువాఁడు మహమ్మదాలీ. అతిసామర్థ్యముగలవాఁడు. ఈతనిశరీరమును తనసంఘాభివృద్ధికిని, దేశసేవకును అర్పించవలయునని ఇప్పుడు ఈతని బుద్ధికి తట్టెను. యథార్థ

ముగా శ్లాఘించఁదగినదేకదా ? ఈతఁడీసంస్థానోద్యోగమునం దున్నచో ఈకోర్కె సఫలతను జెందనేరదు. కావున ఉద్యోగమునకు రెండేండ్లు సెలవుపెట్టెను. వెంటనే కలకత్తాకు వెళ్ళెను. అచ్చో "కాంరేడ్" అనువారపత్రిక నొకదానిని నెలకొల్పి ప్రకటింపఁదొడంగెను.

### కాంరేడ్ పత్రిక; విద్యాసంబంధకార్యములు.

"టైమ్సుఆఫ్ ఇండియా", "హిందూస్థాన్ రివ్యూ," "స్పెక్టేటరు" అనుపత్రికలకు వ్యాసములను వ్రాసి పంపసాగెను. "ప్రస్తుత అసంతృప్తినిగురించి సూచనలు" అనువ్యాసము వైసిరాయి మింటోప్రభువుగారిని ఆకర్షించి వారిమెప్పునుబొందెను. మింటో-మార్లేసంస్కరణములనుగురించి మౌలానామహమదాలీగారియొక్క అభిప్రాయములు వార్తాపత్రికలలో ప్రచురింపఁబడుచుండగా వీరివ్యాసములపై గోఖలేగారు వాదప్రతివాదములు జరుపసాగిరి. మహమ్మదాలీగారివ్యాసములు విజ్ఞానపూరితములై హాస్యరసము చిప్పిలుచుండును. "కాంరేడ్" పత్రికలో "గప్పాలు" అనుశీర్షికతోఁటి వ్యాసములను చదివినవారు మౌలానామహమ్మదాలీగారి వినోదవ్యాసరచనాచమత్కృతిని దెలిసికొనగలరు. వార్తాపత్రికాప్రచారమునే యావజ్జీవచర్యగా జరుపవలయునని మహమ్మదాలీ తీర్మానించుకొనెను. ఈకాలమున పంజాబురాష్ట్రమునందలి జౌరాసంస్థానపు ప్రధానసచివత్వమును జౌరాసంస్థానాధిపతియు, రాష్ట్రీయగవర్నరు సర్ మైకేలు ఓడయరుగారును పూనుకొమ్మని యెంత ప్రార్థించినను వలదనెను.

కలకత్తాలో "కాంరేడ్" పత్రికను స్థాపించెనని చెప్పియుం



టిమి. కాని, వైసిరాయిగారి గవర్నమెంటును కలకత్తానుండి 1912సం॥ సెప్టంబరులో ఢిల్లీపట్టణమునకుమార్చగాతన 'కాంరేడ్' పత్రికాకార్యాలయమును సైతము ఢిల్లీపట్టణమునకు మార్చెను. వార్తాపత్రికాప్రచారమునకు తరిబీతుకానివాఁడైనను, "కాంరేడ్" వారపత్రికను అతిసమర్థతతో మహమ్మదాలీ జరుపుచుండెను. అచిరకాలముననే 'కాంరేడ్' పత్రిక ప్రజల నాకర్షించెను. తనసంఘసేవ, భారతదేశములోనుండు వివిధజాతులలో నైకమత్యము, పాలితపాలకులకు సాన్నిధ్యసిద్ధి ఇవి వీరిపత్రికయొక్క ముఖ్యోద్దేశ్యములు. వీరిలోనుండు భిన్నభావమును రూపుమాయించవలయునని మహమ్మదాలీ విశ్వయత్నము లొనరించెను. తనవార్తాపత్రికగుండా హిందూమహమ్మదీయ ఐకమత్యమునకే పాటుపడుచుండెను.

కాంరేడుపత్రికాపాఠకులు దినదినాభివృద్ధియైరి. పత్రికనలుముఖములను భారతీయుల నాకర్షించెను. అధికారోద్యోగులు సైతము దానికి చందానిచ్చి కొంతకాలము కొనుచుండిరి. అయితే ఆపత్రిక నిష్పక్షపాతబుద్ధితో, కపటదూరమైన భావములను దొరతనపుసంగతులవిషయమై విమర్శించుటకు ప్రారంభించగానే ఈయుద్యోగులు దానిని తెప్పించి చదువుట మానిరి.

### ముస్లీములీగు.

1906-వ సంవత్సరమున ఏర్పడిన ముస్లీములీగుయొక్క నియామకులలో మౌలానామహమ్మదాలీగా రొక్కరు. ఈలీగును మహమ్మదీయనాయకులు కొందఱు ప్రారంభించుటలో 1. 'తమ

సంఘమునకు సంబంధించిన యావత్తుసంగతులను సంరక్షించుకొనుట. 2. దొరతనమువిషయమై తమసంఘములోనివారికి ప్రభుభక్తిని పెంపొందింపఁజేయుట,' అను ఈరెండుముఖ్యోద్దేశ్యములును వీరు గలిగియుండిరి. ఇరుకైన రాజకీయములగు చిత్తడినేలయందే లీగు బహుకాల ముండనేరకపోయెను. ఆలీఘరుపట్టణమునందలి మహమ్మదీయులలోను కళాశాలలోను ప్రవర్ధమానమగుచుండిన ఉదారభావములు లీగుయొక్కమతమునం దావహింపఁదొడంగెను. రాజకీయవ్యవహారములలో ముందంజవేయుచున్న భారత ఇతరసంఘములకు తమసంఘ మెంతమాత్రము వెనుకబడియుండుటకు లీగుసభ్యులు ఇష్టపడలేదు. 1913-వ సంవత్సరమునందు ముస్లీము లీగుమహాసభయొక్క లక్నో సమావేశకాలములో 'భారతదేశములోనుండు ఇతరజాతులు, సంఘములు పొందవలయునని కోరుచుండు బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగ స్వరాజ్యమును తమసంఘమువారును బొందుటకు యత్నించవలయునని' లీగుయొక్కతత్పూర్వఅభిప్రాయమును మార్చిరి. ఇప్పుడన్నచో ముస్లీములీగుసభ భారతజాతీయమహాసభతో పాటు చేఁదోడుసైదోడుగా చేతులుకలుపుకొని వర్తించుచున్నది.

1904-వ సంవత్సరములో మహమ్మదీయవిశ్వవిద్యాలయస్థాపనమునుగురించి తన అభిప్రాయములను పొగడఁదగిన వొకవ్యాసమునందు మహమ్మదాలీ తెలిపియుండెను. దానిని బొంబాయిలో జరిగినమహమ్మదీయమహాసభలో జదివెను. తర్వాతవెంటనే అఖిలభారతమహమ్మదీయమహాసభ లక్ష్మణపురములో జరుగగా అప్పుడును దానిని ఈమహనీయుఁడు మరలఁ జదివెను.



మౌలానాషౌకతాలీగారిని ఒకవిషయమున మహమ్మద్‌హయ్యద్‌ఖాను ఆక్షేపింపగా దానికి మహమ్మదాలీచే యుక్తమైన జబాబియ్యఁబడుటచే అలీఘరువిద్యార్థులును, విశ్వవిద్యాలయాధికారులును ఆలీసోదరులును మిక్కిలి నుతించిరి. అప్పటినుండి భారతదేశమునందు మహమ్మదీయుల కందఱకు వీరిరువురు పూజ్యులుగా నెన్నఁబడసాగిరి.

### మహమ్మదాలీగారియొక్క నిర్బంధమునకు పూర్వము వారితీవ్రకార్యములు.

ఆలీఘరు విశ్వవిద్యాలయసూచన మహమ్మదాలీగారికి పూర్వమే 1873-వ సంవత్సరమునందే ప్రశంసనీయుఁడగు సర్ సయ్యదుఅహమదుఖానుగారి కుమారరత్నమగు న్యాయమూర్తి మామూదుగారిచే చేయఁబడి దానికి ప్రణాళికనుసైతము వారు సిద్ధపరచియుండిరి. ఇప్పట్లో అలీఘరుప్రాంత మహమ్మదీయులకును, ఇంకను భారతదేశములో ప్రఖ్యాతిగాంచియున్న మహమ్మదీయులకును ఆలీఘరును రెండవకార్డోవాపట్టణముగగాని, బాగ్దాదుపట్టణముగగాని చేయవలయునని ముఖ్యోద్దేశ్యమును గొనియుండిరి. 1873-వ సం॥లోనే మహమ్మదీయవిశ్వవిద్యాలయప్రణాళికసూచనలు సూచింపఁబడిన దానికప్పటికి ఫలవంతమగుకాలము రాకపోయినందున ఆయభిప్రాయవిషయమైన ఆందోళనము అప్పటికి ఆపఁబడెను. పిదప మౌలానామహమ్మదాలీగారును, ఇంకకొందఱు మహమ్మదీయప్రముఖులును దానిని పునరుద్ధరించి అందుకుగాను విశ్వప్రయత్నములనుచేసి సాధించిరి.

వీరును, ప్రముఖులగు ది ఆగాఖానుగారునుగూడి దానినిగుఱించి మహమ్మదీయలోకమున ప్రచారముసలుపుచు ద్రవ్యమును పోగుచేయుచు దేశమంతయు పర్యటనముగావించిరి.

## ది"హేండర్డు"పత్రిక.

మహమ్మదాలీగారు పత్రికాప్రచారముయొక్క శ్రేష్ఠత్వమును గుర్తించి దేశభాషలో ప్రబోధముచేసినగాని జనసామాన్యమునకు విజ్ఞానము కలుగనేరదు. అనుతలంపుతో "హేండర్డు" అను ఉర్దూపత్రికను నెలకొల్పి ప్రచురింపమొదలిడెను. దానివ్యాసములు ప్రజలలో తీవ్రమైనప్రబోధకారకములైనందున దానికిముందు ప్రచారములోనుండిన దీనితో సమకాలిక దేశభాషవార్తాపత్రికలకన్న అయిదింతలో ఆఱింతలో అధికవ్యాప్తినిబొందినది. అంతత్వరలో నాపత్రిక జనసమ్మతిని బొందినదే దానికి ముప్పుసంభవించుట తటస్థమయ్యెను. ఆలీసోదరులను నిర్బంధించుటకు పూర్వము దొరతనమువారు ఈవార్తాపత్రికను మొదట ఆపివైచిరి. హేండర్డు వార్తాపత్రికకు సుమారు 9000 వేలమంది చందాదార్లుండిరి దీనిప్రతి వెల అర్థణామాత్రమే. ఈపత్రికయొక్క సంపాదకీయశాఖలో మిక్కిలిసామర్థ్యము నేర్పుగలవారు పనిచేయుచుండిరి.

వీరిలో 1. మీర్ జుహారత్ ఆలీజాలిబు, 2. అబ్దుల్ అఫ్ఘారు అనునిరువురు మిగుల ప్రశస్తిగాంచినవారు. మహమ్మదాలీగారు నిర్బంధింపఁబడినపిదపఁగూడ పత్రిక జరుపఁబడుచుండెను. దొరతనపువారుదానిని సాగనీయక ఆటంకపెట్టుటచే నదిఆగిపోవలసినటుల తటస్థమయ్యెను. వాస్తవముగా "హేండర్డు"పత్రి



కను మౌలానామహమ్మదాలీగారు తానేమియును వ్రాయువాఁడుగాఁడు. ఆపత్రికానిర్వాహకులగు ఉపసంపాదకులకు అనేకసలహాలను సూచించుచుండువాఁడు. వారితో చర్చయెప్పుడును స్నేహభావముగ జరుగుచుండును. తన సహాయసంపాదకులతో "తానధికారి వారునౌకర్లు" అని మెలంగువాఁడు కానేరఁడు. హేండర్డు అంతరించగనే దాని మూలగర్భమునుండి అతితేజస్వంతములుగ సిద్దాటు, టార్జమాను, హెూవ్ డవు, జాంహేరు అను ఉర్దూపత్రికలు పొడమినవి. అంతేగాక వీనికన్నింట ప్రధానమో యన్నట్లు 'న్యూఈరా' అనునది మఱియొకవార్తాపత్రిక "హేండర్డు"స్థానము పొటమరించి విస్తరించెను. 'హేండర్డు' పత్రిక జ్ఞానశూన్యులగు ప్రజాసముదాయమునందు నూతనవాంఛలను కలిగించి నిరంకుశప్రభుత్వమువారి అక్రమములను ప్రజలే స్వయముగా తర్కించి తెలిసికొనఁగల జ్ఞాననేత్రమును వికసింపఁజేసినదనుటలో అయథార్థమెంతమాత్రము నుండనేరదు.

## "కాన్పూరుమశీదు"

1913-వసంవత్సరము ఆగస్టు3-వ తేదినాడు కాన్పూరుయొక్క మచిలీబజారుమసీదుయొక్క కొంతభాగము పగులఁగొట్టఁబడి మచిలీబజారురోడ్డు సూటిగా నొనర్చఁబడినది. ఏదో ఒకరస్తా కాన్పూరుపట్టణములో సూటిగాను, శృంగారముగాను నుండలేదని ఆపట్టణపు పురపాలకపుసంఘమువారు ఆలోచించి ఆయూరి మచిలీబజారురస్తాను అందముగాచేయుకార్యములో అందుండిన తురకలమసీదులోని కొంతభాగమును పగుల

గొట్టవలసినది ఆవశ్యకమని తీర్మానించిరి. మసీదునుపగులగొట్టి రస్తాను అందముచేయు నీయుద్దేశ్యమును మహమ్మదీయులతో పురపాలకసభ్యులు తొలుత కలిసి మాటలాడినవారుకారు. పురపాలకసభాతీర్మానముమేరకు మసీదును ఎంతఆక్షేపణచేయఁబడినను పోలీసుదళమును దగ్గరనుంచుకొని కావలసిన కొంతభాగమును రస్తాలో కలిపివేసి రస్తాను అందముగాచేసిరి. ఇట్లు రస్తా అలంకరణమగుటకు ఇస్లాముమతమునకు తిరస్కారముగావించినవారైరి. ఇట్లు కానూపూరు మునిసిపాలిటీవారు ఒనర్చిన నిరంకుశచర్యకు సేతుశీతాచలమధ్యదేశమునందలి మహమ్మదీయులును, హిందువులును అందఱును కోపోద్దీపితులైరి. దేశమంతయు ఆక్షేపణసభలతో అట్టుడికినట్లు ఉడికినది. హిందూవార్తాపత్రికలన్నియు మహమ్మదీయమతమునకు గలిగినతిరస్కారమును ఘోరమనిరి. ఈయాందోళనమును జరిపినవిధము మిక్కిలి శ్లాఘనీయము. కానూపూరు మహమ్మదీయులు కానూపూరునందు 'ఇద్గా' అనుప్రదేశమునందు సభగూడిరి. తమమతమునకు సంభవించిన తిరస్కారమునకు దుఃఖించిరి. రస్తాయొక్క అందమునకుగాను పూజనీయమైన మసీదులోనిభాగమును పురపాలకసభ్యులు పడగొట్టుట దౌర్జన్యమనియు, మతద్రోహమనియు తీర్మానించి సర్కారు ఇస్లామునకు అపరాధము చేసినారని పరిగణించిరి. ఈసభ ముగియగనే అచ్చోటనుండి వేలకొలదిమహమ్మదీయులు దీనాననములతో పడగొట్టఁబడిన మశీదువద్దకువెళ్లి ఇటికలు పోగుపరచి పడగొట్టినభాగమును తిరిగి కట్టుటకు ప్రారంభించిరి. పోలీసులు ఏదోప్రమాదము జరుగఁబోవుచున్నదని భయ



భ్రాంతులైరి. ఈవీరిభయము నిరాధారము. ఐనను వెంటనే మశీదువద్దను ఆయుధపాణులైన గొప్పపోలీసుపటాళ మేతెంచెను. ఆందోళనాపరులగు ఆగుంపును చెదరగొట్టుటకు ప్రమాదపడి వచ్చినపోలీసులు అచ్చోటనుండిన కొందఱను బంధించిరి. నిరపరాధులగుగుంపుమీద తుపాకులనుగాల్చి కొందఱను వధించిరి. కొందఱకు తుపాకిదెబ్బతగిలి గాయములైనవి. చెదరినగుంపును తుపాకిబాకులతో పొడిచిరి. కొంతసేపటికి పోరాటము సమసి శాంతిపొందినది. పోలీసులదుండగములు నిలిచినపిదప ఆరంగమునకు గౌ. మజూరుల్ హక్కుగారు ఏతెంచిరి. కానూపూరులో తిరుగుబాటుచేసిరని ప్రజలపై నేరారోపణముచేసి కారాబద్ధులుగావింపఁబడినవారితరఫున వాదించుటకు న్యాయవాదులు చార్జి పుచ్చుకొనకయే వాదించుటకు అనేకులు సమ్మతించిరి. ఈసందర్భమునంతయు దూరమునుండి కనిపెట్టి తెలిసికొనుచున్న మౌలానామహమదాలీగారు తనపత్రికలో ఇస్లాముమతమునకు జరిగినఅపవిత్రతనుగురించి తీవ్రముగా వ్యాసములనువ్రాయుటకు ప్రారంభించిరి. తమమతమునకు జరిగినతిరస్కారమును పసితనమునుండియే సహించుటకియ్యకొనని ఆలీసోదరులు ఇంతటిఘోరమైనదౌర్జన్యము మసీదువిషయమున జరిగినప్పుడు ఊరకుందురా? సత్యమును బాగుగా నాలోచించెను. మహమ్మదాలీ. పురపాలకసంఘమువారిది దౌర్జన్యము అనెనుమహమ్మదాలీ. పోలీసులు ఘోరహత్యలుచేసిరని పత్రికలలోవ్రాసెను. ఇంతటికిని నేర్పరియు, బుద్ధిమంతుఁడును, నీతివిచక్షణాపరుఁడును, తనస్నేహితుఁడును నగుసర్

జేమ్సు మెస్టను ఈకల్లోలమును శాంతిపరచుననిమాత్రము నమ్మియుండెను. కాని, ఈవిషయమున నిరాశఁజెందవలసినట్లు తటస్థించెను. సర్ జేమ్సు మెస్టను లక్నోలో తనవద్దకువచ్చినముసల్మానురాయబారులకు కాన్పూరువిషయములో తానేమియు బదనామి పుచ్చుకొననని తీర్పుచెప్పినందున పరిస్థితులు విషమించెను. వెంటనే మహమ్మదాలీ సక్రమాందోళనమునకు ప్రారంభించెను. ఈయాందోళనములు భారతదేశములో ఫలవంతము కానేరవని మౌలానామహమ్మదాలీ గ్రహించి సయ్యదువాజీరుహుస్సేనుగారిని వెంటగొని ఇంగ్లాండులో బ్రిటీషుమంత్రివర్గముతో సంప్రతించుటకు తీర్మానించుకొని ఇంగ్లాండునకు రాయబారముపోయెను. అచ్చో సభలగావించిరి. గొప్పవారిని సందర్శించిరి. నాయకులను ప్రబోధించిరి. బ్రిటీషు ప్రజలకు భారతదేశముయొక్క పరిస్థితులేమియు తెలియనందున వీరిమొఱ లాలింపఁబడలేదు. చెవిటివానిచెవికి శంఖముపూరించినట్లయ్యెను. ఈసందర్భమున విచారకరమైనసందర్భ మొకటి గన్పట్టెను. ఈరాయబారములో చేరినమహమ్మదీయనాయకులకును, అమీరాలీగారికిని పొత్తు కలయిక కుదురలేదు. ఇట్లు పరిస్థితులు విషమదశలోనున్నను వీరువెళ్ళినపని లాభకారి యయ్యెను. తత్పూర్వము సంయుక్తపరగణాలకు లెప్టినెంటుగవర్నరుగానుండినవారును ఆకాలమున ఇండియామంత్రిసభలో సభ్యుఁడును నైన లాటచ్ గారిని సందర్శించిరి. ఈసందర్శనానంతరము ఇండియారాజప్రతినిధి కాన్పూరున కేగుట తటస్థించెను. అప్పట్లో ముస్లీములు తమమొఱలను వైసిరాయిగారితో విన్నవించుకొనగా సమస్యాపరిష్కారము మహమ్మదీయులకు సంతృప్తికరముగ నొనర్పఁబడెను.



వైసిరాయిగారు పరిస్థితుల నాలోచించి ఇదివరలో మసీదుయొక్క పడగొట్టఁబడినభాగమును క్రొత్తగా వేసినరస్తామీదుగా కట్టుకొనవచ్చునని తీర్పుచెప్పెను. తిరుగుబాటుచేసినారని నేర మారోపింపఁబడి శిక్షితులైనవారిని విడుదలచేయవలయునని తెలియపరచెను. ఈతీర్పునకు తొలుత తానిందేమియు జోక్యముకలుగజేసికొనననిన్ని సర్ జేమ్సు మెస్టన్ గారు సమ్మతించిరి. జరిగినఘోరకార్యములకు మనస్సులుచెదరియుండినను దేశక్షేమమునకు మహమ్మదీయులు శాంతిబొందిరి. రాజప్రతినిధిగారిపట్ల తమరాజభక్తిని మహమ్మదీయులు వెల్లడించిరి విషమస్థితి తొలఁగినది ఆందోళనాసంఘమునందు శాంతి స్థిరపరుపఁబడెను. హార్డింజు ప్రభువుయొక్క అప్పటిప్రవర్తనను దేశములోని హైందవవార్తాపత్రికలు ముస్లీమువార్తాపత్రికలు వేనోళ్ల పొగడినవి. ఇంగ్లాండునందుండి మౌలానామహమ్మదాలీగారును సయ్యదువజీరుహుస్సేనుగారును భారతదేశమునకు తిరిగి వచ్చిచేరిరి. వచ్చినవెంటనే హార్డింజిప్రభువుగారికీతీరునతంతివర్తమానమిచ్చిరి.

“గతఆగష్టునెలలో కాన్పూరుప్రజలు దొరతనపు దౌర్జన్యమున అణఁగద్రొక్కఁబడుచుండిరి. వారిమొఱల నాలించుప్రభువులు భారతదేశమునందు లేరని మేము ఇంగ్లాండునకేవెళ్ళి అచ్చోటి నధికారులకు సందర్భములను తెలిపి శాంతిస్థాపనకు యత్నించితిమి. మేము ఇప్పుడు భారతదేశమునకు రాగానే

కాన్పూరుప్రజల ముఖారవిందములు కిలకిలమని వికసించియు
న్నవి. ముందటి దీనాననములు ఇప్పుడు సంతోషమును వెలి
బుచ్చుచున్నవి. ఈశాంతికి కారకులగు తమఘనతను కొని
యాడుటకును కాన్పూరును తాము సందర్శించినపుడు వేలకొ
లది మహమ్మదీయులు ప్రేమపూరితులగు తమఘనతకు చూపినసం
తోషమునే తిరిగి గౌరవపురస్సరమగు సందేశముద్వారా రాజప్ర
తినిధిగారికీదినమున నొసంగుచున్నాము. మామాతృదేశమున మీ
రీక్రిస్టమస్ పండుగలతో సదా శాంతినిస్థాపింతురుగాక! రాం
బోవుతరతరములవారును మీరొకశాంతిప్రతిష్ఠాపకులనియెఱుం
గుదురుగాక!''

ఈసంతోషవార్తను హార్డింజుప్రభువుగారు గైకొని తమ
కార్యదర్శిగుండా తంతిద్వారా ఇట్లు జబాబు నిప్పించెను.

''రాజప్రతినిధి మీశ్లాఘనీయమగువర్తమానమును అనేకవం
దనములతో గైకొనిరి. కాన్పూరులో శాంతినెలకొనినందులకు
మిక్కిలి సంతసపడిరి.''

ఈకార్యమంతయు లాటచ్చిగారిని ఇంగ్లాండులో మహమ్మ
దాలీగారుసంప్రతించినందున ఇండియామంత్రిగారి యుత్తరవు
ననుసరించి హార్డింజుప్రభువుగారు పైజరిపినతీరున చేసిరేగాని
హార్డింజుప్రభువుగారి అపారమగుకరుణమాత్రముకానేరదు.

### అఖిలభారతవైద్యసంఘము.

బాల్కనుయుద్ధములో వ్రణితులగుతురుష్కులు వైద్యస
హాయములేక అల్లాడుచున్నారని వార్తలు భారతదేశమహమ్మ
దీయులను కార్యశూరత్వమునకు ప్రేరేపించెను. వారిసహాయా



ర్థమై విస్తారమైనధనము పోగుచేయుటకును, మౌలానామహమ్మ
దాలీగారును, డాక్టరు: ఎం. ఏ. అన్సారీగారును తురుష్కవై
ద్యసేవాసంఘము నేర్పఱచి తుర్కీయుద్ధభూమియందు గాయ
ములుతగిలినవారికి చికిత్సచేయుటకును సంసిద్ధులైరి. సేవాసంఘ
నియమములన్నియు కామరేడ్‌పత్రికలో 1912 సం॥ అక్టోబరు
నెలలో ప్రచురింపఁబడెను. దానిని ఆచరణకు దెచ్చుటకు
భారతదేశములో నన్నిప్రాంతములవారొకచోట గూడిరి.
ఇందుకు గాయములను కట్టుకట్టుటకు బాగా తరిబీతైన
వారు ఆర్గురును, 12 గురు చికిత్సచేయువారును డాక్టరు
అన్సారీగారివద్ద హాజరుగానుండ నేర్పడిరి. ఈఏర్పాట్లకు
2 లక్షలరూపాయల కార్యము కొనసాగుటకు వలయునని సమా
వేశమున తీర్మానించిరి. ద్రవ్యముపోగైనది. ఈవైద్యసంఘము
తుర్కీకి వెడలుటకుపూర్వము హార్డింజుప్రభువుగారిని సంద
ర్శింపగా వారిట్లనిరి. ''నేనీసంఘకార్యమును మిగుల మెచ్చుకొ
న్నాను. సంఘమువారికి అనేకవందనములను సమర్పించుచు
న్నాను. ఈసంఘము యుద్ధరంగమున అన్నిసేవాసంఘముల
కంటె విశేషముగ పూనికతో కార్యమును సలిపి యశస్సును
పొందవలయును. కలరాజాడ్యము ఆశియాఖండములోని జాడ్య
ము. కావున ఈవ్యాధిని హైందవవైద్యులు త్వరలో కుదుర్చ
గలరని సంఘమును శ్లాఘించెదను. ఈసంఘమునందు అలీఘురు
విశ్వవిద్యాలయప్రాతవిద్యార్థు లెక్కువగా నున్నందుచే నాకు
మిక్కిలి సంతసముగానున్నది. ఈజిప్టుదేశమందును తుర్కీదేశ
మందు మీసేవాసంఘమునకు సాయపడి సహకారముగా పనిచే

యుటకు ఇంగ్లీషువైద్యులఏర్పాట్లను చేయుమని భారతమంత్రి గారికి తంతినిచ్చెదను.''

ఈవైద్యసంఘమువారు 1912సం. డిసంబరునెలలో బొంబయినిడి సంగ్రామస్థలమునకు 1913సం. జనవరినెల 1వ తేదినాడు చేరిరి. వీరిరాక అచ్చటివ్రణితులగు తురుష్కులకు సుఖవికాసము గల్గించెను. వీరు చేరునప్పటికి అచ్చటిదురవస్థలు, ఇంతంతనరాదు. ఈవైద్యసంఘమువారు వెంటనే తమపనులను ప్రారంభించిరి. ఈవైద్యయువకులు మిక్కిలి నేర్పుతో పనిచేసిరి. వేలకొలదిమందిని కాపాడి కీర్తినిగాంచిరి. ఈసంఘము అచ్చోట ఆఱునెలలుండినది. ఈసంఘకార్యకారకులగు మాలానామహమ్మదాలీగారును, డాక్టరు: ఎం. ఏ. అన్సారీగారును తురుష్కులచేనేమి, భారతమహమ్మదీయులచేనేమి ఎంతో శ్లాఘింపఁబడిరి. ఈసేవాసంఘముయొక్క వైద్యపనిముట్లలో నెక్కువభాగము తుర్కీ రెడ్డుక్రెసెంటు వైద్యసంఘమునకు నొసంగఁబడినది. మిగిలినదానితో హైందవరెడ్డుక్రెసెంటుసంఘమును స్థాపించవలయునని తలంపుతోనుండగా జర్మనీమహాసంగ్రామము తటస్థించెను. ఆపనిముట్లంతయు హిందూదేశప్రభుత్వమున కుచితముగా నొసంగఁబడెను.

## ఢిల్లీసందర్భములు.

మహమ్మదాలీగారు ఢిల్లీకి వచ్చినదిమొదలు పామరజనులతో కలసి మెలసియుండువారు. వారిని దూరముగా నెంతమాత్రముంచక మెలఁకువతో వారిమధ్య మెలంగుచు విశేషజనపరిచితుడైయుండెను. పామరజనులక్షేమమునే అభివృద్ధిచేయవలయునని



కోరికగలవాఁడు. కావున, ఢిల్లీలో పామరజనులును ప్రజాసముదాయమును మాలానామహమ్మదాలీగారిని పూజావిగ్రహముగ భావించియుండిరి. ఈమహనీయుఁడు తనపనినిమాత్రమే చూచుకొనక ప్రజాహితకార్యము లెన్నింటిలోనో జోక్యముకలిగించుకొని కృషిసలుపుచుండెను. ఈసమయములో ఢిల్లీలో కటికవాళ్లసమ్మె ప్రారంభమై పట్టణజనులను ఒకమాస మిది వేధించెను. ఈకటికవాండ్రు పురపాలకసభాధ్యక్షునియొద్దనుండి లైసెన్సులనుబొందుటలో పురపాలకసంఘమువారి కట్టుదిట్టములనేకములను నిరాకరించిరి. ఇందుకై సమ్మెకట్టిరి. మహమ్మదాలీ యందఱితో పరిచయముకలవాఁడు కాన పరిస్థితులు విషమదశకు చెందువఱకు అందులో జోక్యముకలిగించుకొనకుండి రెండుపక్షములవారి అభిప్రాయములను బాగుగ బోధపఱచుకొని ఈవిషయమై ఏదోయొకతీరున సంధిచేయుటకు అహోరాత్రులు కృషిసలిపియుండెను. తుదకు పురపాలకనిబంధనలలో మార్పులనుచేయించి కటికవారిలో పుట్టినఅసంతృప్తిని పోగొట్టెను. ఈసమయమున మహమ్మదాలీ ప్రవేశించి ఉభయులకు రాజీని సంతృప్తికరముగ కుదిర్చెను.

మహమ్మదాలీగారు రాజకీయపరిస్థితులను బాగుగ దెలిసికొనుటకు సదా యత్నించుచుండెను. అప్పటప్పటికి తమసంఘము మిక్కిలిధైర్యము, పౌరుషము, ఆత్మస్థైర్యముగలదిగ మారుచుండుటను తెలిసికొనెను. మితివిరామములేక పూనికతో తన సంఘాభివృద్ధికొఱకును, సంఘమునందు ప్రజాప్రభుత్వాపేక్ష పొడముటకును కృషిసలుపుచుండెను. ప్రజాప్రభుత్వాదర్శము

లుగల యువకులు ప్రాతనాయకుల స్థానముల నాక్రమించుకొనుటను దెలిసికొనెను. ఈయువకులు సంఘముయొక్క ఏకాంతస్థితియందుండు పరిస్థితిని తొలఁగించి జాతీయకార్యములయందు ఇతరసంఘములతోఁ బాటు తమసంఘము సైతము పాల్గొనుటకు వారు యత్నింపసాగిరి. మహమ్మదాలీ సంఘమును ఉద్ధరించుటకు నిరంతరోత్సాహపూరితమైనకృషిచే పూర్వపు రాజకీయవ్యవహారములలో నాయకులమనుకొన్నవారు పదభ్రష్టులైనందున వారిస్థానములను పైయువకులు ఆక్రమించుకొనసాగిరి.

### హిందూమస్లీము ఐకమత్యము.

యథార్థముగా మౌలానామహమ్మదాలీగారు తనమహమ్మదీయసంఘోద్ధరణమునకే పాటుపడుచుండెను. అట్లుచేసినను మొత్తముమీద హిందువులయొక్కయు తదితరసంఘములయొక్కయు అభివృద్ధికిని హక్కులకుగూడ పోరాడువాఁడయ్యెను. భారతీయులందఱు క్షేమపడవలయునన్నచో నొక్కమహమ్మదీయసంఘముయొక్క హక్కులకుమాత్రము పోరాడినచో నది సమకూరదనియు, హిందువులహక్కులు సైతము కాపాడఁబడినగాని భారతదేశము సుఖవంతముకానేరదనియు, అందుకు హిందూమహమ్మదీయులఐక్యభావము ఆవశ్యకమనియు మౌలానా ఆలీగారు దీర్ఘదృష్టితోఁ దెలిసికొనిరి. "జాతులలో స్నేహభావమెల్లప్పుడును పరస్పరనమ్మకముమీదను అన్యోన్యగౌరవముమీదను ఆధారపడియున్నది" అని యొకానొకప్పుడు వ్రాసియుండెను. కావున హిందూమహమ్మదీయులలో స్నేహభావ



మును జనింపఁజేయుటకుగాను తాను కాశీహిందూవిశ్వవిద్యాలయమునకు వెళ్ళియుండి ఆచ్చోట హిందూమహమ్మదీయ ఐకమత్యమునుగుఱించి ఉపన్యాసమొసంగి హిందువులయొక్క దేశభక్తియందలి ఆసక్తి ఉత్సాహములను గ్రహింపఁగలిగెను. అంతేగాక ఆయుపన్యాసములో హిందువులు యథార్థహిందువులుగను, మహమ్మదీయులు యథార్థమహమ్మదీయులుగను నైనచో వారిలో కలహములే జనింపవనియు, ఉన్నస్వల్పకలహకారణములు తమంతటతత్క్షణమే తొలఁగుననియు నుడివియుండెను. అందులకు తార్కాణముగా భారతదేశములో నీసమయమున ఆలీసోదరులకంటె హిందూమహమ్మదీయసఖ్యతయొక్క తీవ్రపక్షావలంబకు లితరు లెవ్వరును కానరారు.

### ఆతనివిద్యాదర్శములు.

ఇతరవిషయములలోవలెనే విద్యావిధానమునందును మిక్కిలి స్థిరమైన అభిప్రాయములు మహమ్మదాలీకి గలవు. ప్రస్తుతఆచరణమునందుండు విద్యాపద్ధతిని ఎంతమాత్రము సందిగ్ధముకాని మాటలతో ఖండించి సార్థకమైన జాతీయవిద్యను చక్కగా నిర్వచించి ఇట్టిదే దేశమునందు ఆచరణమైనదని నొక్కి వక్కాణించియుండెను. ఆతనియభిప్రాయములయొక్క వివరణ మీక్రిందితీరున చెప్పఁబడియున్నది.

"ఇండియాదేశమునందు సర్కారువిద్యావిధానముయొక్క మూలసూత్రములు స్వప్రయోజనము ననుసరించియు, మిక్కిలి యల్పఫలితమునిచ్చునదిగా నున్నవి. సర్కారుయొక్క ఈవిధానపుముఖ్యోద్దేశ్యము తమనౌకరతనము నడచుటకు వలసిన యు

ద్యోగులను నిర్మించుటతప్ప వేఱొండులేదు. కావున నీవిద్యావిధానమునకు తరిబీతగువాఁడు ఏదో యంత్రనిర్మిత బుద్ధిపరిణామములుగలవాఁడుగ జేయఁబడుచున్నాఁడు. ఈవిధానము పూర్తిగా ప్రయోజనకారిని చేయుట లేకపోవుటయేగాక మూర్తిమంతము కలిగించలేక అపజయమును బడసినది. ఏలననగా నావిధానములో బుద్ధిబలముజనింపదు. ఉన్నతభావములు లేవు. గుణమును మేధను కలిపి వినియోగించగలశక్తి ఎంతబుద్ధిమంతునకును ఈవిధానము కలిగించ నేరదు. విదేశప్రభుత్వము వారిచే ఏర్పాటుచేయఁబడియుండు ప్రజాసామాన్య విద్యావిధానమునందు జాతీయత ప్రజలలో జనింపనేజనింపదు ఆప్రభుత్వమున కుపకరించగలఉపకారులను మేధావులను సిద్ధమాపద్ధతి చేయఁగలదు. ఈపద్ధతిగుండా బహుకాలమును ధనమును వెచ్చించి విద్యనేర్చినవారు తమ తరిబీతువలన నూతనపద్ధతులను ఏర్పాటుచేయఁగల శక్తిసామర్థ్యములుకలిగినవారు కావచ్చును. మంచివ్యాపారమును నేర్పుతో జరుపువారుగ నేర్పడవచ్చును. మంచిపరిశ్రమాభివృద్ధికి కారకులుగావచ్చును. కాని, ఈమహామహులు తమభావములను ముఖ్యోద్దేశ్యములను మూర్తిమంతమొనర్చి జాతియొక్క ఆశయములను, బుద్ధియొక్కయు నీతియొక్కయు బలమును, కేంద్రీభూతముగజేసి జాతినెంతమాత్రము బలిష్ఠముగావింపలేరు. జాతియొక్క సామాన్యజీవితమును, విశాలహృదయముతో పెంచి నూతనాదర్శములతో పురికొల్పుటను వీరెంతమాత్రము పూనుకొనుటకు శక్తియుతులుకాలేరు. సంపూర్ణజాతీయవికాసము కలుగవలెనన్నచో జాతీయపద్ధతులపై



నిర్మింపఁబడిన దృఢమైన వేరువిధమగు విద్యావిధాన మేర్పడవలయును.

ప్రాథమిక ఉన్నతవిద్యయొక్క విధానము గొప్పఫలితములను గలిగించవలసినచో విద్యావిధానముపై యధికారమును దొరతనమువారు జోక్యమును వదలి భారతీయుల హస్తగతమొనర్చుట ఆవశ్యకము. సర్కారుబళ్లు, పాఠశాలలు, విశ్వవిద్యాలయములు ఎంతసన్నాహముగలదియైనను, సమర్థతగలదియైనను జాతీయతాపద్ధతిననుసరించి విద్యార్థులను మూర్తిమంతులుగను, సన్నీతిపరులుగను చేయనేరదు. భారతదేశమంతయు నొక్కటిగ నైకమత్యముగలిగిన నిండుజాతీయవికాసమును గలిగినది కావలయునన్నచో ఉన్నతవిద్యావిధానపద్ధతులన్నియు పూర్తిగ భారతీయులస్వాధీనము చేయఁబడవలయును. భారతీయుల అసమానమగుశక్తులను కనుగొనవలయునన్న హిందూ మహమ్మదీయ విశ్వవిద్యాలయములే నిదర్శనములు. జాతీయదర్శములు జాతీయశక్తితో నూపిరాడించవలయునన్నచో జాతీయపద్ధతులమీద నిర్మింపఁబడిన విద్యావిధానముండవలయును. భారతదేశము ఏకోద్దేశముతో నభివృద్ధిగావలసినచో సంపూర్ణమగు జాతీయవికాసముతో వెలుగవలసినచో, ఉన్నతవిద్యావిధానముపై సర్కారు తమఅధికారమును వదలివైచి ఆయధికారమును భారతీయులకే వదలివేయవలయును.

ఆలీఘరులో నెలకొనియుండు మహమ్మదీయవిశ్వవిద్యాలయము కూడినంతవరకుపై జాతీయాదర్శములుగలిగి పైవిధానము పునాది ఏర్పడినదై యున్నది.”

వక్త, వార్తాపత్రికాప్రచారకుఁడు, కవీశ్వరుఁడు

ఇంగ్లీషు మనకు మాతృభాష కాకపోయినను భారతీయు లనేకులు దానియం దసమానవిద్వత్తును గడించి ఆంగ్లేయుల చేతనే పొగడ్తను జెందియున్నారు. మహమ్మదాలీగారు ఉన్నత తరగతి ఆంగ్లభాషావక్త. తనఉపన్యాసభావములను వినువారి హృదయమందు బాగుగ సన్నుతింపజేసి నాటునంతటి ప్రబోధకతాభాషాశైలితో మాటలాడు నేర్పుగలవాఁడు. ధోరణితో గూడ యథార్థమైన, మెండైన విషయములుగలవాఁడు. విషయమువెంబడి విషయము తోఁచుకోనక్కరలేక స్ఫూర్తిగలవాఁడు. మిక్కిలిధైర్యశాలి. వ్యూహములను నేర్పుతో పన్ను వాఁడుకాఁడు. రాజ్యాంగవిషయములసాధనకై సత్యమును వీడఁడు. సత్యమునకై ఉరిమానును సైతము ఎక్కుటకు వెను దీయనంతటి నిశ్చలచిత్తుఁడు. ఖిలాఫత్తురాయబారముపై ఐరోపాకు ఏగియున్నప్పుడు పారిసుపట్టణములో నీతఁడు గావించిన మహోపన్యాసము ఐరోపియనులగుండె లావులింపఁజేసినవి. తన అసమానవక్తృత్వముచే నచ్చోటి జనుల సమ్మోహింపఁజేసెను. దానియొక్క భాషాంతరీకరణ మందలి భాషాసౌష్ఠవము సత్తులేనిదైనను భావముమాత్రము మాచదువరులు గ్రహింపగలుగుటకు ఈక్రింద స్పష్టపరచెదను.

''నేను శాంతి కావలయునను వాఁడను ప్రపంచమున్ను శాంతిని కోరుచున్నది. (హర్షధ్వనులు.) ఇస్లాముమతమనగా శాంతియే. అయితే గ్రీకులు సమరమును గోరిరా వారు దానినే బడయుదురు. (హర్షధ్వనులు.) ఇచ్చటగాని ఇంగ్లాండునంచు



గాని హర్షమునుచూపిన ప్రయోజనములేదు. సమరమునందు గ్రీకులు జయించిరా అన్నియు కల్యాణమేయగును. ఓడిరా అచిరకాలముననే ఆవార్తలను వినెదము; గ్రీకుజాతియైనందున గాదు. వారికి ఓటమితటస్థించుట అధర్మపరులైనందుననే. (హర్షధ్వనులు.) వెంటనే వారు ఫిరించివారగు మీకును ఇంగ్లీషువారికిని ఏకమతస్థులమని అందఱము క్రైస్తవులమని తోడునకై విజ్ఞప్తులను పంపుకొందురు. క్రైస్తవధర్మములను వారు తామే నేలబెట్టి కాలరాచియున్నారు. నేను తుర్కీవాఁడను గాను. నేను గతమహాసంగ్రామములో మీకును ఇంగ్లాండునకును విజయార్థము మీతట్టు పోరాడిన ఒకతెగవారికి సంబంధించిన వాఁడను. మీతో ఇప్పుడు మీఎదుట మాటలాడుచుండు వాఁడు తుర్కీవాఁడు కాఁడు. ఐతే నేనేల ఇందులకు వచ్చితి నసెదరా, నామతధర్మము నన్ను ఇచ్చోటికి రమ్మని ప్రేరేపించినది. నాతోడ నాదేశమునుండు ఇతర మతధర్మములవారును జాగరూకులుగ నాలోచించి నేనీకార్యమునకై ఆందోళనము సలుపుట నామతధర్మమని సైతము నుడివియున్నారు. ఇప్పటి రాజీ యొడంబడికలషరత్తు మాసమాధాన మెంతమాత్రము పడయ నేరనిదియేగాక, మాతోటి ఇతరమతస్థులు సైతము తామీఏర్పాట్లకు రాజీపడమని ప్రమాణమును జేసియున్నారు. (బొమంజీగారును ఇతరపార్సీలు హైందవులు ఇందుల కంగీకారమును గాన్పించిరి.) ఈసభలోగాని ఐర్సాలీసు, కాంస్టాంటినోపిలు పట్టణములలోగాని, ఇంతయేల ముస్తాఫాకెమాలుగారిశిబిరములో గాని ఉండెడు ఏసిగ్గులేనితురుష్కుఁడు ఈరాజీకి ఒప్పుకొని

నను నేను లాయడుజార్జి గారితోను, ఇండియా రాజప్రతినిధి తోను చెప్పియుండునట్లు మేము ఎంతమాత్రము ప్రస్తుత రాజీ షరత్తులను అంగీకారము చూపము.”

“ఈసమస్యను మామతధర్మము ననుసరించి విచారించితి మేని, ఈరాజీ మేము ఒప్పదగినది కానేరదు. ఇంతేగాక ఇండియా, తుర్కీ, అల్జీరియా, మొరాకో, చిన్నఆసియా, ఈజిప్టు, మధ్య ఆసియా ఈదేశములలోనుండు సుమారు 30 కోట్లమహమ్మదీయ మతధర్మములు ఈరాజీషరత్తులలో నిరాకరించఁబడియున్నవి. మఱియును మీరును ఇంగ్లాండువారును, వాగ్దత్తపూర్వకముగా నొసగినవియు అందుచే కాపాడితీరవలసినవియు నగు ప్రత్యేక ఖరారులున్నవి. అవి ఈనాఁడు నిరాకరింపఁబడినచో మరవకుఁడు. మీజాతి వర్తకముచే జీవించునది. మీపెద్దశెట్లందఱు ఇచ్చోట గూడియున్నారు (నవ్వు) ఒకమారు త్రిప్పకొట్టఁబడి అవమానపరచఁబడిన హుండి రెండుమార్లు చెలామణి యగునా? (హర్షధ్వనులు). ఫ్రెంచిదేశమునకుగాని, ఇంగ్లాండుదేశమునకు గాని మేమేమైనను చేసియుండు ఉపకారమునకు ప్రత్యుపకారముకాదు మేము ఇప్పుడు వాంఛించుట. అయితే మరే మందురా వినుడు.

ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని అండగా భారతవీరులు ఈమహాసంగ్రామమున నిలచి పోరాడిరి. మెసపొటోమియా, పలస్తీనాలలో దిగ్విజయములనుబొందిరి. గమనింపుడు. ఈజయము బ్రిటీషువారిదిగాదు సుమా! భారతీయులదే యని తెలిసికొనుడు. (హర్షధ్వనులు). తమవిజయానంతరము సంధిషరత్తులు ఈతీరున పరిణమించునని వారికి తెలిసియున్నచో 1914-వ సంవత్సరపు అక్టోబరునెలలో మీప్రాణాపదసమయమున మీకు తోడుగా వచ్చియేయుండరు!”



కాంరేడ్ పత్రికాపాఠకులకు మౌలానామహమ్మదాలీగారియొక్క వార్తాపత్రికాప్రచారపుసామర్థ్యము వేఱుగ వ్రాయానక్కఱలేదు. వారివ్యాసములు, భాషాసౌష్ఠవముగలిగి స్పష్టమై కారముగలవై, బోధనాశక్తియుతమై యొప్పారుచుండును. పాఠకులను ఆకర్షించి అవి ఇయ్యగలముఖ్యఫలితమును తప్పక ఇచ్చుచుండును. సర్కారుచేతలను విమర్శించునప్పుడు ఆవిమర్శలు ద్వేషరహితములుగానుండును. అవి నిర్భయత్వము, నిష్కాపట్యముతో పూరింపఁబడియుండును.

మహమ్మదాలీకి కవనధోరణిసైతము గలదు. మతవిషయములే కవిత్వవిషయములుగానుండును. సర్వమును మేలుకొఱకే ఉద్దేశింపఁబడిన దనువాదములోఁ జేరినవాఁడు. ఆతనికవనమునందు మనఃప్రబోధము విశేషమైనధర్మము.

### తుర్కీమహాసంగ్రామము.

మిత్రమండలిపై తుర్కీ సమరమును సాటించగనే భారతదేశపు మహమ్మదీయులు కలవరపడి తికమకలైరి. తుర్కీకాలిఫా వారికి మతగురువు. ఇంగ్లాండురాజు వారిని పాలించురాజు. వారి మతధర్మానుసరణమును ఒకతట్టు గట్టిపెట్టి, ఇంగ్లాండురాజునకు ప్రభుభక్తిని జూపునిమిత్తము ముసల్మానులు ఇంగ్లాండుయొక్క యుద్ధములలో పాల్గొనిరి. ఇంగ్లాండుశత్రువు తమ మతగురువైనను వాని కెదురుగా ఐరోపాలో ఇంగ్లాండుతట్టు

నిలచి పోరాడిరి. ఆసమయమున ఇంగ్లాండుమంత్రి లాయిడు జార్జిగారు భారతమహమ్మదీయులు తమమతగురువున కెదురుగా సమరముసల్పినందులకు వారికి ప్రోత్సాహముగలుగునట్లు అంత్యమున అటోమాన్ సామ్రాజ్యమునకు లోపముగాని, మతవిషయములలో ప్రవేశించుటగాని, ఏలాటిమనఃపీడాకరములగు సంగతులనుగాని చేయుటలేదని వాగ్దానములు చేసియుండిరి. ఈవాగ్దానములచే ముసల్మానులు సమాధానపడియుండగా మహమ్మదీయేతరరాజ్యములు కొన్నియు, కొన్ని ఆంగ్లేయవార్తాపత్రికలును టర్కీకిని సుల్తానునకును విమర్శమూలమైన వ్యతిరేకభావములను తీవ్రముగా వెల్లడించి దేశభక్తమహమ్మదీయులనేకుల మనశ్శాంతికి కలవరము కలుగఁజేసినవి. ఈతీవ్రవిమర్శనలనుచేసినపత్రికలలో "లండన్ టైమ్సు" పత్రిక యొకటి. ఈ విమర్శలకు మౌలానామహమ్మదాలీ కోపోద్దీపితుఁడయ్యెను. లండనుటైమ్సులో వెలువడిన "తురుష్కులవాంఛితము" అను శీర్షికక్రింద వెలువడిన వ్యాసమునకు మౌలానామహమ్మదాలీ తన "కాంరేడు" పత్రికలో తీవ్రప్రత్యుత్తరము నొసంగెను. ఆవ్యాసమునందు తురుష్కసామ్రాజ్యమునకు ఐరోపియనురాజ్యములచే గావింపఁబడిన కీడులయొక్క పెద్దపట్టిక నొకదానిని వెల్లడించి ఒక్కొక్కదానియొక్క యథార్థస్థితిని నిష్కపటముగా వర్ణించి వ్రాసెను. లండన్ టైమ్సుయొక్క వ్యాసము ముస్లీముమతమునకే అవమానమునుగలిగించి వ్రాయఁబడినది. ఈ తిరస్కారమును ఏమాత్రము ఆత్మగౌరవముగల మహమ్మదీయుఁడును సహింపలేఁడు. మౌలానామహమ్మదాలీగారి ఈ



వ్యాసపు జవాబుయొక్క తీవ్రత, సంపూర్ణత, బలిమి ఈమూటిని ఇండియాదొరతనము అందుకొని దానిని అణఁచుటకును మహమ్మదీయులలో నది ఉద్రేకము కలిగించక చేయుటకును ప్రయత్నములను గావించినది.

మహమ్మదాలీ సదా న్యాయమునకు సత్యమునకును పోరాడువాఁడు. దొరతనముపై ద్వేషము ఎప్పుడును చూపియుండలేదు. అయితే తురకరాజ్యము అనిపించుకొనఁదగిన టర్కీనిమాత్రము గాఢముగా ప్రేమించెను. లండన్ టైమ్సుపత్రిక టర్కీరాజ్యమునకు తానే విదేశాంగమంత్రిపదమునకు బూనుకొని టర్కీని తటస్థముగానుండునట్లును, గ్రీసుతో యుద్ధముచేయవద్దనియును సలహాచెప్పెను. ఈ లండన్ టైమ్సుపత్రికయొక్క వ్యాసమంతయు నుద్రేకమును రగిలించునదియు దుర్వాదముగనునుండెను. ఈవ్యాసమునకు బదులు కాంరేడ్ పత్రికలో 1914 సంవత్సరము సెప్టెంబరు 16-వ తేదినాఁడు మర్మభేదమైనసూటిజవాబును వ్రాసెను. భారతప్రభుత్వమువారు రోషయుక్తులైరి. జార్జిచక్రవర్తిగారిశత్రువులను మౌలానామహమ్మదాలీగారు ప్రోత్సాహించుచున్నారని భావించిరి. తత్పూర్వము కాంరేడ్ పత్రికకును, హందార్డ్ పత్రికకును విధించియుండిన పూచీకత్తు అపరాధధనములను కైవశముచేసికొనిరి. ఆలీసోదరులకు అప్పటినుండి ఒకనిమిషకాలమైనను శాంతిలేదు. కష్టములపై కష్టములు సంప్రాప్తించినవి. అనేకసంవత్సరములు నిర్బంధము ననుభవించవలసినవారై స్వేచ్ఛనుగోల్పోవుట తటస్థించినది.

### నిర్బంధావాసము.

1915-వ సంవత్సరము మే నెలలో ఆలీసోదరు లిరువురును నిర్బంధావాసమున నుంచఁబడిరి. దొరతనమువారు దీనికి కారణములను వెల్లడించలేదు. భారతదేశము ఆసేతుహిమాచలపర్యంతము దొరతనమువారి ఇట్టిచర్యను ఆక్షేపించుచు ఈవిధానమునకు కారణములను గోరుచు సభలుగావింపఁబడినవి ఇవన్నియు అరణ్యరోదనములయ్యెను. కారణ మేమియును దెలుపఁబడలేదు. మొట్టమొదట మహరౌలీలో నిర్బంధావాస మేర్పడినది. అచ్చోటినుండి చిండ్వారాకు మార్చఁబడిరి. ఈనిర్బంధకాలములో ఆలీసోదరు లిరువురును మతగ్రంథముల ననేకములను, ప్రపంచ చరిత్రను విశేషముగా పఠించిరి. చెఱసాలయందుండుకాలమునందే ఆత్మోద్రేకమును గలిగించు జాతీయగీతములను రచించెను. డిఫెన్సు ఆఫ్ ఇండియాశాసనము క్రింద సోదరు లిరువురును బంధింపఁబడిరనిమాత్రము దొరతనమువారు వెల్లడించినకారణము సూచించినది. వారిస్వేచ్ఛ దేశోపద్రవకరమని తలంపఁబడి వారిస్వేచ్ఛపై నిరోధమును దొరతనము తెచ్చిపెట్టెను. పిదప ఢిల్లీపరగణాయొక్క దొరతనపు 1915-16 పరిపాలనా నివేదికము వెలువడినప్పుడు ఆనివేదికమునందు "రక్షణ" అనుశీర్షిక క్రింద ఈతీరున దొరతనమువారు ప్రకటించియుండిరి.

"మహమ్మదీయసంఘములో నొకభాగమునకు ఇండియాదొరతనమువారిమీద ద్వేషముపుట్టించి దొరతనమునకు చెఱుపు గలిగించు ఉద్దేశ్యముతో తీవ్రప్రచారమును సలుపుచుండిరి గావున ఆ నెలలోనే (మే) మహమ్మదాలీ, షౌకతాలీ గార్లను అత్యావశ్యకముగా నిర్బంధమునం దుంచవలసివచ్చినది."



1917సం॥ ఫిబ్రవరి21-వ తేదినాడు సామ్రాజ్యశాసనసభలో గౌరవనీయులగు దాదాభాయిగారు (డిఫెన్సు ఆఫ్ ఇండియా) ఇండియాసంరక్షకశాసనమును సవరించవలయునని ఇండియాదొరతనమునకు శిఫార్సుచేయుచు నొకతీర్మానమును దెచ్చియుండిరి. ఇందువలన ఇండియాదేశపు అన్నిరాష్ట్రములలో ప్రత్యేకవిధానము లేర్పడవలయుననియు, ఆవిధానమునకు సంబంధించిన ఉద్యోగస్థులు పైశాసనము మేరకు ఎవరినైనను అములుజరుపఁదలఁచికొన్నచో వారిని బాగుగ పరీక్షించుటకు వారికి వీలుండవలయుననియు పైతీర్మానము ఉపపాదించియుండెను. ఈతీర్మానముపై గౌరవనీయులగు మజరల్ హక్కుగారు ఇట్లు నుడివియుండిరి.

"...ఈశాసనము అములులోనుండినందున, నాసంఘమునకు జేరినవారు మహమ్మదీయులు మితిలేనికష్టములపాలైరి. మాసంఘము వారిచే మహనీయులై పొగడ్తకెక్కినవారును, మామహమ్మదీయ సంఘము ఎవరిపై గౌరవము ప్రేమ అధికముగా చూపుచున్నదో అట్టివారు ఈశాసనము క్రింద అణఁగద్రొక్కఁబడి చెఱసాలావాసము చేయుచున్నారు. వారేల చెఱసాలకంపఁబడిరో, వారిదోష మెద్దియో సంఘమువారి కెవ్వరికిని అతిగూఢముగానున్నందున తెలియరాకయున్నది. వారిదోషము ఫలానిదనిగాని, వారు బదనామీగల ఉద్యోగులచే విచారింపఁబడి నేరారోపణమును గావింపఁబడియుండినను ఒకవేళ మే మాక్షేపించియేయుండ నేరము. మాసంఘములో నధికసంఖ్య ఈనిర్బంధములను గణించి మిక్కిలి విశ్వాసరాహిత్యమును జెందియున్నారు. వారి

పేళ్లను సర్కారువారు గుర్తించుకొనుటకు చెప్పుటలో ఆటంకమేమియులేదు. హోంమెంబరుగారు పేళ్లను వ్రాసియుంచుకొనినను ఉంచుకొనవచ్చును. వారినిగురించి మహమ్మదీయసంఘమంతయు పశ్చాత్తాపమును గనపరచుచున్నది. వారు మహమ్మదాలీ, షౌకతాలీ, మౌలానాఅబ్దుల్ కాలంఅజాదుగార్లు. వీరు ముప్వురు ఇండియాలోని మహమ్మదీయులందఱకును పూజ్యులు. వారిని నిర్బంధించియుంచుటకు వారిదోషము నిర్ణయింపఁబడక యుండుట మిక్కిలిదౌర్భాగ్యము. వారు నేరస్థులగుచో వారు తప్పక శిక్షింపఁబడవలసినదేను. అప్పట్లో మేమెల్ల వారము దొరతనమునందు దోషములేదని దొరతనమువారిపక్షము నవలంబించెదము అయ్యో! దేవుఁడాయనిరైనను వారినేరమును నిర్ధారింపుఁడు. వారిని చెఱసాలప్రవాసమునందుంచినందులకు కారణమునైనను దెలుపుఁడు. గౌరవనీయులగు నాస్నేహితులు దాదాభాయిగారును, ఖాండాగారును సూచించినట్లు సలహాలను సూచించు సంఘమొకటి యుండినచో, అవి తమతీర్మానాభిప్రాయములను వెలిబుచ్చును. మాసంఘమంతయు తృప్తిపడియుండును. చెఱసాల కంపఁబడినవార్లకు వ్యతిరేకముగా విచారణకాలములో సాక్ష్యము తేలినందున వీరు శిక్షితులైరను శాంతియుతమైన నొక సంతృప్తి కలుగును.

“వారు (ఆలీసోదరులు) బహిరంగముగా ఉపన్యాసములు గావించుచుండిరి. పత్రికలలో వ్యాసములు వ్రాయుచుండిరి. వారియుపన్యాసములు, వ్రాతలు అపాయమును జనింపఁజేయునవియా, లేక ప్రజాక్షేమమునకు భంగకరములా యనుప్రశ్న



కిప్పుడు సమాధానము కావలసినది. దానిని నిరూపించుటకు ‘సర్ రెజినాల్డు క్రాడాక్కుగారి యభిప్రాయముమేరకు సలహాసంఘములుపనిలేవు. ఇండియారక్షణశాసనముయొక్క ముఖ్యాంశమును పరీక్షించినచో చెఱసాలకంపఁబడినవాఁడు నేరస్థుఁడు కావలసినది లేదనియు, నేరమును చేసియుండ పనిలేదనియు, దేశక్షేమమునకు భంగముగా ప్రవర్తించిగాని ప్రవర్తించుచుగాని, ప్రవర్తింపగలవాఁడని గాని తెలియవలసినదే ప్రధానము,” అప్పటి హోంమెంబరు సమాధానమును చెప్పెను.

దేశము ఇట్టిసంశయార్థములతో చెప్పఁబడిన కారణములతో సంతృప్తినిబొందలేదు.

పిదప ఆనీబిసాంటుగారు నిర్బంధమున నుంచఁబడగా వారిని విడుదలచేయవలసినదని గౌరవనీయులగు జిన్నాగారొక తీర్మానము నుపపాదింపగా దొరతనము ఆతీర్మానమున కీప్రత్యుత్తరమునిచ్చెను.

“ఇండియాప్రభుత్వమువారు మదరాసుప్రభుత్వమువారికి బెసాంటు, అరండేలు, వాడియాగార్ల నిర్బంధమును తీసివైచునట్లు సిఫార్సుచేయుటకు సంసిద్ధులైయున్నారు. అయితే సదరు ముప్వురును సంప్రాప్తమైయుండు మహాసంగ్రామకాలములో ప్రజలలో తీవ్రమగు ఆందోళనాపద్ధతులను ప్రవేశింపఁబెట్టకమాత్ర ముండవలయును.” మఱియును,

“తీవ్రరాజకీయఆందోళనాపద్ధతులను ప్రజలలో ప్రవేశింపఁజేసి ప్రజలను ఉద్రేకపూరితులుగఁజేయుదురను శంకచే ఇండియాసంరక్షణశాసనము మేరకు నిర్బంధమునం దుంచఁబడి

యుండు ఇండియాలోని ఇతరరాష్ట్రములవారియెడలను ఇస్లా మాలోచనలు సలుపునట్లును, నిర్బంధింపఁబడినవారు తీవ్ర రాజకీయోపన్యాసములను ప్రజలలో ప్రవేశపెట్టకయుండు టకు పూచీకత్తునిచ్చినచో వారికిసైతము విడుదలచేయఁబడుయు నని ఇండియాదొరతనమువారు సంసిద్ధులైయున్నారు." అని ప్రత్యుత్తరమొసంగిరి.

ఈజబాబు దొరతనమువారు చెప్పినవెంటనే గా॥ జిన్నా గారు "ఆలీసోదరులనుసైతము విడుదలచేసెదరా"? అని యడిగిరి. అందులకు దొరతనమువారీక్రిందిజబాబు నొసంగిరి.—

"దొరతనమువారు మహమ్మదాలీ, షౌకతాలీ వీరివిడుదలలను గురించి ఇదివరలోనే యాలోచనానిమగ్నులై అందువిషయమై విచారణలు సలుపుచున్నారు."

ఆలీసోదరుల నిర్బంధావాసచరిత్రలో 1917వ సం సెప్టంబరు 5 మొదలు 26 తేదిలోపుగా గలకాలము మిక్కిలి ప్రాముఖ్యమునుబడసినది. సెప్టంబరు 7వ తేదినాడు డిప్యూటీపోలీసు సూపరెంటెండెంటు అబ్దుల్ మజీదుగారిని చింద్వారాలో నిర్బంధితులైయుండు ఆలీసోదరులకడకు సింలానుండి రాయబారము పంపిరి. సర్ చార్లెసుక్లీవ్లాండుగారు ఒకనమూనాను అబ్దుల్ మజీదుగారివశమిచ్చి ఆనమూనాప్రకారము ఆలీసోదరులు బద్ధులగుట కిష్టపడవలయుననిరి. నమూనా ఈక్రిందితీరుననున్నది.—

"యుద్ధముయొక్క మిగిలినకాలములో నేదైనను రాజచక్రవర్తిగారిశత్రువులకు ప్రోద్బలమగుదానినిగాని, సహాయకరమగుదానినిగాని, ఎంతన్యాయయుతముగానున్నను చేయుట



నుండిగాని, వ్రాయుటనుండిగాని, చెప్పుటనుండిగాని నేను విరమించెదను. మఱియును రాజచక్రవర్తిగారియొక్క స్నేహితులు, మిత్రమండలినిచేరినవారు. వీరిని ఆక్షేపించగల ఏకార్యమును చేయుటనుండిగాని వ్రాయుటనుండిగాని మాటను చెప్పుటనుండిగాని సైతము విరమించెదను. మరిన్ని ప్రజాక్షేమమునకు భంగముగా దలంపఁబడు ఏవిధమైనతీరుతెన్నులుగాని తీవ్రాందోళనములను సలుపుటలేదని వాగ్దానముకూడ చేసెదను."

విమర్శనము:—"పైఖరారు ప్రకారము పద్ధతిమేరకు రాజకీయములలో ప్రవేశింపగూడదని నిర్ణయములేదు."

ఆలీసోదరు లిరువురును పైదానికిట్లు జబాబు దొరతనమువారికి వ్రాసిరి.

"బిస్మిల్లా ఇర్ రహమాన్ - ఇర్ - రహీమ్. మాకు పవిత్రమైన మతగ్రంథమగు ఖొరానునిబంధనలకు మామతప్రవక్తయగు మహమ్మదుజీవితముయొక్క గ్రంథములో మహమ్మదువాక్తలకును వ్యతిరేకముగాకయుండు అన్నిసంగతులను ఒప్పుకొనుటకు సంసిద్ధులముగానుండునంతటి దైవభక్తిగల్గి సదా దైవమునకు భయపడునంతటి మహమ్మదీయులము మేము. ఈమామతమునకు విరుద్ధమేమాత్రము కలుగనీయక చట్టములకు బద్ధులమై దేశమును ప్రేమించి తీరుతెన్నులు, తీవ్రముగానిదియు. నగు రాజకీయాందోళనాపద్ధతులను అవలంబించక, యుద్ధమున్నను యుద్ధములేకున్నను దీనినే సదా గౌరవము వర్తింపగలవారము. కావున ఇవిగాక, మామతపద్ధతులకు

వ్యతిరేకము కానట్టి ఇంక నెట్టి పూచీకత్తునుగాని ఇఁకను గోరుచో నవి రాజచక్రవర్తిగారి శత్రువులకు ప్రోద్బలమైనదనియు సహాయపడుననియు ఎంత న్యాయముతోఁ గూడియున్నను వానిని చేయుటనుండిగాని, వ్రాయుటనుండిగాని చెప్పుటనుండిగాని మేము విరమించెదము. మఱియును రాజచక్రవర్తిగారి స్నేహితులు, మిత్రమండలిలోఁజేరినవారునైన ఏవారినిగాని యాక్షేపించగలకార్యమును చేయుటనుండిగాని వ్రాతను వ్రాయుటనుండిగాని, మాటను చెప్పుటనుండిగాని విరమించెదము. మఱియును ప్రజాక్షేమమునకు భంగముగాఁ దలంపఁబడు ఏవిధమైన తీరుతెన్నులుగాని తీవ్రాందోళనములను విరమించెదము. ఈపైనిబంధనలన్నియు మామతస్వేచ్ఛను ఏమాత్రము భంగకారి కాదను పునాదిమీదనే వాగ్దానములుగా చేసియున్నామని గ్రహించెదము. మామతధర్మముల నాచరించుటలో అణుమాత్రమైనను మా కాటంకము కలుగదని తలంచి పైవ్రాతలనువ్రాసి పంపియున్నాము. తీరుతెన్నులగు రాజకీయాందోళనములను గావించగలహద్దులలోనే యుండుట కాటంకముండదని సైతము భావించి ఈవాగ్దానములను చేయుచున్నాము.”

ఈసందర్భములు జరిగినపిదప రెన్నాళ్లకు మహమ్మదాబాదురాజాగారు చింద్వారాకువెళ్లి ఆలీసోదర్లను సందర్శించి ముఖాముఖిని వారివిడుదలసంగతులనుగుఱించి మాట్లాడి వారిమనోభావములను గుర్తెఱింగి సంతృప్తమానసుఁడయ్యెను. ఈసందర్భమున రాజా ఆఫ్ మహమ్మదాబాదుగారిని ఒక వేగువాఁడు



కనిపెట్టియుండినందున వారు చాలా వ్యథపడిరి. బిసాంటమ్మగారలతో ఆలీసోదరులుసైతము విడుదలనుబొందుదురని ఎల్లవారును వేచియుండిరి. ఆలీసోదరుల పైవ్రాతలు దొరతనమువారిభావములను ఎంతమాత్రము మార్చలేకపోయెను. సెప్టంబరు 26-తేదినాఁడు ఇండియాదొరతనమువారి శాసనసభలో సర్ విలియం విన్సెంటుగారు గౌ॥ జిన్నాగారి కిట్లు ప్రత్యుత్తరము నొసంగిరి:—

“ఇండియా శాసనసంరక్షణముక్రింద మహమ్మదాలీగారిని, షౌకతాలీగారిని రాజకీయతీవ్రాందోళనములు సలిపినందునకేగాక వారు బాహాటముగా రాజుగారిశత్రువులపక్షమవలంబించి వారియెడల సానుభూతిని పశ్చాత్తాపమును గనపఱచి అందుగుండా ప్రజాక్షేమమునకు భంగమును గావించినందున నిర్బంధమునం దుంచఁబడిరి. వీరినిగుఱించి ఇండియాదొరతనమువారు ఇంకను విచారణలను సలిపి ఎఱుకలోనికి తేఁబడిన సంగతిని పర్యాలోచనచేసి పూర్వపు నేరస్థాపనకాఁబడిన దస్తావేజులను మరల పరీక్షించగా ఈవిషయమున ఆలీసోదరులభావములు ఎంతమాత్రము మారలేదుకావున, వారినిర్బంధములు క్షేమకరములుగా తొలగింపఁబడుటకు వీలుజనించునంతటి సంతృప్తికరములగు గుర్తులు కానఁబడలేదు.”

ఈయతిగూఢములగు “నేరస్థాపనకుకారణములైనదస్తావేజులను” వానిని ఇప్పటికి దొరతనమువారు వెలిబుచ్చిరి ఇవి తటాలుమని ఇప్పుడు బయలువెడలెను. అవి రెండు ఉత్తరములు ఒకటి ఆఫ్గనిస్థానపు అమీరుగారికిని, రెండవది లక్నోపట్ట

ణమునందుండిన సుప్రసిద్ధ 'ఫారంగి' యను సన్న్యాసికి ఆలీసోదరులు వ్రాసినవట! అవి రాజద్రోహస్వభావముగలవని నిర్ణయింపబడినవి "వీనియొక్క కర్తృత్వాధికారము తనదిగాని తనసోదరునిదికాని స్పష్టముగా కానేరదనియు, అందులో నుండు నేరారోపణమున కాస్పదమైన భావముల నేదానికిని తాము పూచీకామనియు, అయుత్తరములను తమకుచూపుమని," పలుమారు మహమ్మదాలీగారు వేడియుండిరి; కాని, దొరతనమువారు ఆకాగితములను వారికి చూపనేలేదు.

మజరుల్ హక్కు, జిన్నా, తనవిడుదలానంతరము బెసంటమ్మగార్లు ప్రభుత్వమును ఆలీసోదరులను విడుదలచేయుమని ఎంతో వేడిరి. కాని, ప్రయోజనకారి కాలేదు. కొంతకాలమైనతర్వాత ఆలీసోదరుల కుటుంబరక్షణార్థము నెలకు 1000 రూపాయలు ప్రభుత్వ మొసంగుటకు మొదలిడెను. ఐరోపామహాసంగ్రామముచే ప్రపంచముయొక్క నలుదెసలలోను తీవ్రచలనము ప్రారంభమయ్యెను. ఈచీకాకువలన నెచ్చోటను శాంతిలేదు బ్రిటీషువారిస్థితియే సంశయమాయెను. వెంటనే దైవానుగ్రహమువలన జర్మనీచక్రవర్తికి అపజయముగలిగెను. మిత్రమండలివారు జేతలైరి. మిత్రమండలివారి కనుకూలముగ సంధిషరత్తులేర్పడి శాంతిసూచనలు కన్పట్టెను. బ్రిటీషువారును నానాదేశప్రభువులును సంతసించిరి. జర్మనీచక్రవర్తిని కోఱలు తీసినపాముగఁజేసిరి. పంజాబువధలవలన భారతదేశమున అసంతృప్తిప్రబలెను. శాంతిప్రతిష్ఠ భారతదేశమున అవసరమయ్యెను.



## సోదరుల విడుదల.

కావున బ్రిటీషుదొరతనమువారు భారతదేశములో రాజకీయనిర్బంధితులను విడుదలచేయవలయుననియు, కానిచో శాంతిస్థాపన కానేరదనియుతలంచి 1919-వ సం॥ డిసంబరు నెలలో సార్వభౌమప్రకటనము నొకదానిని భారతదేశమున కంపిరి. ఇది నిర్బంధితులైయుండిన భారతమహమ్మదీయనాయకుల విడుదల కాస్పదమయ్యెను. ఈసమాచారము భారతదేశముయొక్క ఒకకోననుండి వేరొకకోనకు మెఱుపువలె ప్రసరించెను. ఆసమయమున కొంతమంది రాజకీయనిర్బంధితులను విడుదలఁజేసిరి. దేశాభ్యుదయమునకు కష్టముపాలగుచుండు ఆలీసోదరులను గూడ విడుదలచేయుదురని వదంతికలిగెను. వదంతులు కొన్ని సమయములలో యథార్థములగునట్లు వెంటనే సార్వభౌముని ప్రకటనముమేరకు అలీసోదరులు సైతము విడుదలకాఁబడిరి. వెంటనే, వారి దేశభక్తి ఎట్టిదోగాని ఆసమయముననే పాంచాలదేశమునందు అమృతసరపట్టణములో జరుగుచుండిన దేశీయమహాసభకు వెళ్లిరి. ఆమహాసభ వీరికి యుక్తమైన స్వాగతమొసంగినది. రాజకీయములలో నానావిధాభిప్రాయములుగల ఎల్లవారికిని వీరి విడుదల సంతసస్వాంతులనుగఁ జేసినది. సభవారందఱును దొరతనము ఇంతకాలమునకైనను జూపిన న్యాయమునకు వందనములనొనర్చిరి. పాంచాలరాష్ట్రమునందు జరిగిన దురంతములకు, జలియన్‌వాలాతోటహత్యలకు కారకుడైన పాంచాలరాష్ట్రగవర్నరు ఓ డయరుగారిని తత్క్షణమే ఇంగ్లాండునకు పిలిపించుటకుగాను బ్రిటీషుప్రభుత్వమువారిని దేశీయ

మహాసభవారు కోరవలయునను తీర్మానమును మౌలానామహమ్మదాలీగారు తీవ్రమైన వాగ్ధోరణిని జూపుచు ప్రసంగించియుండెను. అప్పోటనే సమావేశమైన ఖిలాఫత్తుమహాసభకు హాజరై భారతదేశమునకు బ్రిటీషుప్రభుత్వముచే నొసంగఁబడిననూతన సంస్కారణములను ప్రజలు అందుకొని వానిని యామోదించి ప్రజలు ప్రవర్తించవలయు ననుతీర్మానమును ఆమోదించెను. తన్ను నిర్బంధించి కష్టపెట్టినప్రభుత్వముపై మౌలానామహమ్మదాలీగారి కెంతవిశ్వాసమున్నదో అందుల కిదియే నిదర్శనము.

సర్కారు వారిపై విధించిన పూచీకత్తుధనమును కైవశము చేసికొనుటవలనను, వారియాస్తినంతయు వారిస్వాధీనముచేయక తమఏలుబడిలోనికి దెచ్చికొనినందునను వారిని బహుకాలము నిర్బంధములోనుంచుకొన్నందునను ఆలీసోదరులకు విస్తారమైన ధననష్టముకలిగెను. వారు విడుదలను బొందినప్పుడు వారిస్నేహితులనేకులు వారికొప్పమొత్తమును సేకరించి ఇచ్చి ధనసహాయమునుచేయవలయునని తలంచిరి. అందునిమిత్తముగాను పలుకుబడిగల హిందూమహమ్మదీయసోదరులసంఘ మొకటి ఏర్పడి ఆలీసోదరులకు ఒకవరాలసంచిని పారితోషికముగా నిచ్చుటకుగాను దేశమంతయు పైకమును వసూలుచేయుటకు ప్రారంభించెను. వారెంత ద్రవ్యహీనులైన దరిద్రులయ్యును ఈవరాలసంచిని తమ స్వోపయోగమునకు వెచ్చించుట కొల్లరైరి. ఈచందాధనమును ప్రజాహితకార్యమునకు వెచ్చించుటకు తీర్మానించిరి.



## ఖిలాఫత్తుకార్యమునకువిధానము.

మహాసంగ్రామకాలములో ఇంగ్లాండుప్రధానమంత్రి లాయడుజార్జిగారు భారతమహమ్మదీయులకు యుద్ధమున ప్రోత్సాహముతో తమఇస్లాముసోదరులతో ఏమేమో బాసలిచ్చియుండెను. యుద్ధము ముగియగానే మహామంత్రి ఆవాగ్దానములను నెరవేర్చుటకు సమ్మతిలేక 'అప్పటిమాటలను దుప్పటిస్తే కలకాలం కప్పుకోనిచ్చితినా?' యనెను. ఆవాగ్దానములకు పెడర్థములు చేసెను. బ్రిటీషుసామ్రాజ్యపు ప్రధానామాత్యునియొక్క ఈద్రోహము భారతమహమ్మదీయులను కోపోద్దీపితమానసులను జేసెను. మహామంత్రి తనవాగ్దానముల నుల్లంఘించెను.

మహమ్మదీయులవాద మేమనగా జజాతుల్ ఆరబ్బుప్రదేశము మెసపటోమియా, అరేబియా, సిరియా, పలస్తీనాదేశములతో జేరి వానియందుండు తురకల పవిత్రస్థలములతో యుద్ధమునకు పూర్వ మున్నట్లే తురుష్కసామ్రాజ్యాధికారి యగు కాలిఫాగారి ప్రత్యేకపరిపాలనముక్రింద ఉండవలయునని, దాత్కాలిక సంధిఒడంబడికయొక్క ఫలితానుసారముగ తురుష్కసామ్రాజ్యమునకే అపాయమువచ్చెను. తుర్కీభూములను మిత్రమండలివారు తమలో పంచుకొనిరి. థ్రేసుదేశము గ్రీకులకు దత్తమైనది. తురుష్కసామ్రాజ్యపు ఆసియాభూములను ఇంగ్లాండువారును ఫ్రెంచివారును అధికారులు అను నెపమున తమలోతాము పంచుకొనిరి. మిత్రమండలివారు తుర్కీని పాలించుటకు హైకమిషన్ అనుసంఘము నొకదానిని ఏర్పఱచిరి. ఇందుచే తుర్కీసుల్తాను పేరునకుమాత్రము సుల్తానేగాని

అధికారమేమియు తనరాజ్యమున చలాయించలేకపోవుటయే గాక హైకమీషనర్ వారిచే నొకవిధమైన ఖైదీగ భావింపఁ బడెను.

ఇంగ్లాండుదేశముయొక్క ప్రధానామాత్యుని ఈవిద్రోహకార్యమునకు భారతదేశమునందలి మహమ్మదీయులేగాక ఇతర సంఘములుగూడ కుపితులైరి. అమృతసరములోఁజరిగిన కాంగ్రెసు ఖిలాఫత్తునాయకులు లాయడుజార్జిగారి ఈఘోరకృత్యమువలన ఏర్పడియుండుదేశపరిస్థితిని బాగుగా విమర్శించిరి. వెంటనే గాంధిమహాత్ముని నాయకత్వము క్రింద ఖిలాఫత్తు ఉద్యమమును భారతమహమ్మదీయులు ప్రారంభించిరి.

1920 సం॥ జనవరినెల మధ్యకాలములో ఆలీసోదరులు తమయెడల దేశముచూపిన సానుభూతికి వందనములర్పించి తమకర్తవ్యోద్దేశ్యములుగల ఒకప్రకటనపత్రికను బహిరంగపఱచిరి. అందు ముఖ్యమైనభాగములవివరము లిట్లున్నవి.—

“ఖిలాఫత్తురాయబారవర్గ మొకటి యేర్పఱచియున్నాము. ఈరాయబారవర్గమువారు ఇండియా రాజప్రతినిధిగారిని సందర్శించుటకు సంసిద్ధులైయున్నారు. ఈరాయబారమునకు రాజప్రతినిధిగారు తమభేటిని ఎప్పుడు కలిగించుట కిష్టపడేసంగతి ఒకటిరెండుదినములలో దెలియును. వైసిరాయిగారి సహాయముగుండా ఇంగ్లాండు, పెర్షియా, అమెరికా, తుర్కీ దేశముల కీరాయబారవర్గము వెళ్ళుట కేర్పాట్లుచేయఁబడియున్నవి. ఈనెలాఖరున ఈరాయబారవర్గము ప్రయాణమగుటకు వీళ్ళన్నియు సంసిద్ధముగనున్నవి. మాయుద్దేశ్యము విజయముపొందుట కేలాటిసంశయ



మునులేదు. అది మతము, న్యాయము వీనిని గట్టిపునాదిగా గలిగియున్నది. కావున మాయుద్దేశ్యము ఎంతమాత్రమున్ను దుర్బలత్వముగలిగినది కానేరదు. కాలీఫాస్థానము, జజైతుల్ అరబ్బు పవిత్రస్థలములు, ఓటోమాన్ సామ్రాజ్యపు సంపూర్ణత, వీని సందర్భములలో మాకోరికలయొక్క సంపూర్ణమగు న్యాయము వీనివిషయమై పవిత్రమంతమగు ఇస్లాముసాయముతో అయిరోపారాజ్యములను, అమెరికారాజ్యమును సమాధానపెట్టుసందర్భమున నెంతమాత్రమును వృథాప్రయత్నము నెన్నటికిని చేయనేరము.”

ఈరాయబారములను జరుపుటకు విస్తార ధనముయొక్క ఆవశ్యకత, విలువను వారు గుర్తించిరి. అయితే ఈయాందోళనమునకు ఈపద్ధతి తప్ప వేఱుపద్ధతి కానరాదు.

హిందూమహమ్మదీయనాయకులతో గూడిన ఒకబలమైనరాయబారవర్గము 1920 సం జనవరిమధ్యలో ఇండియాకు అప్పటి వైసిరాయిగారు షెమ్సుఫర్డు ప్రభువువారిని సందర్శించెను. ఈవీరివాంఛితములు కేవలము మహమ్మదీయులవే గాక ఖిలాఫత్ సమస్యావిషయములో భారతప్రజాబాహుళ్యమునకు సైతము వారి ఉద్యమములో సానుభూతిగలదని వైసిరాయిగారికి వ్రాతమూలకోపన్యాసముగుండా శ్రుతపఱచిరి.

అందుండి ఈక్రింద కొన్నిభాగములను తెలుపుచున్నాము.—

“సామ్రాజ్యప్రభుత్వమువారు క్రైస్తవాశయముల నెట్లు కాపాడుచున్నారో అట్టులే మహమ్మదీయులయొక్కయు, హిందువులయొక్కయు ఆశయములను కాపాడుటకు సముత్వ

బుద్ధిగల సంరక్షకులుగా నుండవలయును. మా యాశయములను వాంఛితములను లీగుయొక్క ఆలోచనకుమాత్రమే వదలినచో చాలదనియు బ్రిటీషుమంత్రులును వీనికై పక్షము బూని ఈ యభియోగము తమదిగానే భావించి పనిచేయవలయును. ఇస్లాముమతపీఠమగు ఖిలాఫత్‌లో ప్రపంచాధికారమున్ను పెనవేయఁబడియున్నది. కావున సుల్తానును నామమాత్రావశిష్టముగాచేయుట కాలదన్ని నేలరాచినట్లగును. ఇట్లొనర్చుట ఐరోపాదేశపు క్రైస్తవరాజ్యములన్నియు జేరి భారత మహమ్మదీయులను అవమానపరచినారని ఎన్నఁబడుదురు. 1918 సం॥ రము జనవరి 4-వ తేదినాఁడు లాయిడుజార్జి చేసియుండు ఖరారును నెరవేర్పుమని కోరుచు, మాకు ఉచితమైన న్యాయమును మేమేదియు కోరలేదని చూపునిమిత్తము, సుల్తానురాజ్యములో నివసించుమహమ్మదీయేతరుల రక్షణను అడుగుటకు మిత్రమండలివారికి గలహక్కులను వారికే వదలుచున్నాము. అనగా: ఆజాతులసంరక్షణార్థము సుల్తానుగారియొద్దనుండి ఏలాంటి పూచికత్తులను తీసికొనవలయునో, ఖరారులను గోరవలయునో అపూచీకత్తులను ఖరారులను మిత్రమండలివారు ఆవశ్యకముగా కోరవచ్చును.''

రాజప్రతినిధి షెంస్ఫర్డు ప్రభువుగారు రాయబారవర్గము పక్షమున మిక్కిలి మర్యాదతో ప్రవర్తించి వారివాంఛితములయెడ సానుభూతిని గనపరచి తనవలన కాదగినదియు తనశక్తివంచనలేనిదియు నగుకార్యమును టూకటంకములేక చేయుటకు వాగ్దానము నొసంగెను. శాంతిసభయెదుట వారివాదమును విమర్శించుటకుగాను ప్రస్తావనకు తెచ్చునట్లు తప్పక చేసెదనని చెప్పెను.



ఈరాయబారముయొక్క ఫలితము సంతృప్తికరముగా ముగిసినది కాదు.

ఈరాయబారములు హెడ్జాజునకు, స్మర్నాకు, మెసపటేమియాకు, ఈజిప్టునకు, పెర్ష్యాకు వెళ్లుటకు రహదారి నిచ్చుట లేదని ఇండియాగవర్నమెంటు ఖండితముగా చెప్పెను. కావున భారతదేశమువైపునకు రాయబారముయొక్క గమనము త్రిప్పఁబడెను. ఇచ్చటనే ఖిలాఫత్తుకార్యమును అంగక్రమముతో నిర్మించుటకు ప్రారంభించిరి. కేంద్రఖిలాపత్తుసంఘముతో తీవ్రసంబంధమును ఈరాయబారము కలిగించుకొని, దాని సర్వాధికారము తమవశపఱచుకొని, దాని నిబంధనలను మూలసూత్రములను సవరించిరి; దానిపునాదిని బలపరచిరి.

## ఇంగ్లాండునకు రాయబారము.

మౌలానామహమ్మదాలీగారిని పురస్కరించుకొని అఖిలభారతఖిలాపత్తురాయబారము 1920 సం॥ మార్చి నెలలో ఇంగ్లాండునకు జేరెను. ప్రతిపట్టణమునందును వీరి కాశాభంగమును గొల్పుచుండెను. ఇంగ్లాండులో తమఉద్దేశ్యమునకు ఏవిధమైన సానుభూతిగాని అండగాని లేకపోయినను వారికార్యముయొక్క పట్టువదలక కృషిసలుపుచునేయుండిరి. తురుష్కులు ఐరోపాఖండములోనే యుండరాదనియు, వారిని కాన్‌స్టాంటినోపిలు పట్టణమునందుండి నిలువనీడనీయక తరుమవలయుననియు, ఐరోపాఖండములోనే దేశమునగాని వారిని ఉండనియ్య

తలయునను పశ్చాత్తాపమునే గనపఱచరాదనియు, ఇంగ్లాండులో పలుకుబడిగలనాయకులు ఈసంపూర్ణభావములతోఁగూడి కొని నిశ్చంచలులై యుండిరి.

ఫిషరుగారిని, ఆస్క్విత్తుగారిని ఇంకను ఇంగ్లాండులో నుండిన అనేకరాజకీయకక్షులనాయకుల నందఱను మహమ్మదాలీగారు సందర్శించిరి. కార్మికపక్షమువారు మాత్రము రాయబారులకు మిగుల తోడ్పడిరి. ఆల్బర్టుభవనమునందును, కింగ్స్‌లే భవనమునందును బహిరంగసమావేశములను వారుగూర్చి ఆంగ్లేయ ప్రజాప్రబోధమునకు దారితీసిరి.

మహమ్మదాలికి మిక్కిలి ఆశాభంగమై నిరుత్సాహమైనను, మేలుకలుగకపోనేరదను ధీరత్వముగలవాఁడగుటచే తాను చేయవలసినప్రయత్నములను ఇనుమిక్కిలిగా చేయుచుండెను. ఇంగ్లాండునందు "మస్లీము ఔట్లుక్కు," పారిసుపట్టణమున "ఎక్కోడి ఇస్లాము," అను వార్తాపత్రికలు మహమ్మదీయవాంఛితముల ప్రచారమునకు ప్రారంభింపఁబడెను. మెసపొటోమియాపై ఆంగ్లేయాధికారమును నెలకొల్పినది తప్పని ఆంగ్లేయప్రజలు భావింపఁగలిగిరి.

సాన్‌రమోనందు సమావేశమైన సుప్రీంకౌన్సిలుసభలో తమవాంఛితముయొక్క ప్రస్తాపనను తెచ్చుటకు సెలవియ్యమని మహమ్మదాలీ కోరియుండెను. అందుకు అనుజ్ఞనియ్యక నిరాకరించిరి.

ఫ్రెంచిదేశము, ఇటలీదేశము ప్రప్రథమముననుండి ఫ్రెంచివారును ఇటలీవారును తుర్కీసమస్యవిషయమై పశ్చా



త్తాపమును గాన్పించుచు సానుభూతిగలిగియుండిరి. ఈరెండురాజ్యములు ఈఒడంబడికలోని ఘోరషరత్తులచే తుర్కీని అడిమి ఆచరణీయమునకు నిర్బంధపెట్టగూడదని ఒకేపట్టుగా తీర్మానించుకొనియుండినవి. ఈరాయబారవర్గమువారు ఫ్రెంచిదేశపు సుమారు 30-ప్రతినిధులను సందర్శించియుండిరి. వీరెల్లరును భారతమహమ్మదీయులయొక్క హక్కులను నొక్కి చక్కగా బోధపరుచుకొనిరి. 1922 సం॥ ఆగష్టు 12-వ తేదినాఁడు ఫ్రెంచివారి ప్రధానిని మహమ్మదాలీగారు సందర్శించియుండెను. ప్రధాని సెవర్సుసంధి అంత్యము కాదనెను. ఫ్రెంచిదేశములో రాయబారులకార్యముయొక్క ప్రశస్తమైనకార్య మేమనగా సెవర్సుసమాధానపత్రములను సంపూర్ణముగా సవరించునట్లు "వెనిజీవిస్టుమాటన్' అనుపత్రిక సైతము బలముగా ప్రోత్సహించుటయే.

ఇటలీదేశములో మహమ్మదాలి క్రైస్తవరోమన్‌కాథలిక్కుమతాధిపతి పోపుగారిని సందర్శించెను. పోపు ఈరాయబారుల ఉద్దేశ్యములకు సంపూర్ణసానుభూతిని గనపఱచెను. ఆటోమాన్ తురుష్కులయొక్కయు వారి ప్రభుత్వముయొక్కయు అన్యమతసహిష్ణుత్వమును ఒప్పుకొనెను; కాన్‌స్టాంటినోపిలువఱ పోపురాయబారవర్గమును ఒకప్పుడు పంపియుండి తురుష్కులు వారిని మర్యాదతో చూచినసందర్భమును తననివేదికలో తాను గుర్తించియుండినదే సాక్ష్యమని మహమ్మదాలిగారికి నిరూపించెను.

ఈరాయబారమువలన ప్రత్యక్షఫలిత మేదియు సాధింపఁబడలేదు.

ఈతీరున బ్రిటను, ఫ్రాన్సు, ఇటలీదేశములలో అధికారవర్గముతోను అనధికారవర్గముతోను సంప్రతించియు వార్తాపత్రికలలో వ్యాసములను వేదికలపై యుపన్యాసములను గావించియు మహమ్మదీయవాంఛితములయొక్క మోక్షసిద్ధికి ఐరోపాజాతుల ఉపకారములపై ఆధారపడియుండుట వ్యర్థమని మహమ్మదాలీగారు తీర్మానమునకు వచ్చిరి. ఈతీర్మానము శ్రీ పటేలుగారిగుండా భారతదేశమునకు తెలియచేసిన వర్తమానము భారతవార్తాపత్రికలలో 1920-ఆగస్టు 23-వ తేదినాఁడు బయల్పడెను. ఆవర్తమాన మీతీరుననున్నది. దాని కొన్నిభాగములను ఈక్రింద పొందుపరచియున్నాము:—

“భారతఖిలాఫత్తు రాయబారవర్గమువారు ఐరోపాఖండమున కాలుపెట్టినది మొదలు తమ నియమితఆజ్ఞను విశ్వాసముతో చక్కగా నెరవేర్చిరి. అఖిలభారతఖిలాఫత్తుసంఘమువారిచే అంగీకరింపఁబడిన ప్రకటనపత్రికను ఆధారపరచుకొని తురుష్కసంబంధతీర్మానమునుగురించియు భావిఖిలాఫత్తునుగురించియు మహమ్మదీయులయొక్కయు భారతీయులయొక్కయు యథార్థస్థితిని బ్రిటీషు, ఫ్రెంచి, ఇటాలియన్ ప్రతినిధులకును జపానుప్రభుత్వప్రతినిధికిని తెలియఁజేసితిమి. బ్రిటీషు, ఫ్రెంచి, ఇటాలియనుల వార్తాపత్రికలలోను ఉపన్యాసవేదికలగుండాను మాభావములను స్పష్టపరిచితిమి. ఈదేశములలో రాజకీయవాతావరణమునందు మెలగుచునుండువాఁడును, ప్రభుత్వకార్యములలో నిమగ్నుడగువానిసంగతిని చెప్పనేయక్కరలేదుగదా! ఇఁక నెట్టివిద్యావంతుఁడును తురుష్కసమస్యవిషయమై భారతదేశము అనుభవించుపాటును ఎఱుగనని చెప్పుటకు వీలులేక యొనర్చితిమి. మిత్రమండలివారి దృఢసంకల్పమువలన మాప్రచార మీదేశములో నెట్టిఫలవంతమును బడయలేదు. ఇంతేగాక మనప్రభువర్గమువా రెంతమాత్రమును మహమ్మదీయులయొక్కగాని భారతీయులయొక్కగాని మొరలను వినుటకు సందిచ్చినవారుకారు. తురుష్కసంధిపత్రము చేవ్రాల్లకు సంసిద్ధమైయుండుటయే ఇందులకు నిదర్శనము. రాయబారవర్గము తమ యావచ్ఛక్తి సామర్థ్యములను వంచనలేక వినియోగించిరి. తమసందేశమును వారు శ్లాఘనీయముగ నెరవేర్చిరి; కాని, మిత్రమండలియొక్క దృఢసంకల్పమును భేదించలేకపోయిరి. కావున, భారతహిందువులయొక్కయు మహమ్మదీయులయొక్కయు సదాలోచనల కెదురుచూచుచున్నారు. ఈరాయబారవర్గమునకు వారు భారతహిందువులును మహమ్మదీయులును చేయగల సదోబ్బధనాపద్ధతిప్రకారముఆజ్ఞను శిరసావహించెదరు”.



## సహాయనిరాకరణోద్యమము.

మహమ్మదాలీగారు ఇతరరాయబారవర్గముతో 1920అక్టోబరు మాసమున ఇండియాకుచేరెను. వెంటనే బొంబాయిలో ఒకసమావేశము గావింపఁబడెను. ఆసభలో ఐరోపాఖండములో తానొనర్చినకార్యము నంతయు నుడివెను. భారతమహమ్మదీ

యులు భారతీయులగు హిందువులతో సఖ్యమేర్పాటుచేసికొని భారతస్వరాజ్యమునకు పాటుపడుటయే తప్పని పనియనియు, మోక్షసాధనమనియు, దానిమీదనే ఖిలాఫత్తుసమస్యాపరిష్కారమున్ను ఆధారపడియున్నదనియు, తనముఖ్యమైనసలహాను ఆసభవారికి దెలిపియుండెను. యూరోపుఖండమునకు పోవు రాయబారము అపజయమునుపొందినచో తానేమిచేయు నను ప్రశ్నకు యూరోపునకు వెళ్లుటకుపూర్వమే సమాధానమిట్లు చెప్పియుండెను.

“ఖిలాఫత్తురాయబారము వ్యర్థమైనచో విచారపడవలదు. వినుఁడు; మనరాయబారముయొక్క స్వభావము అపజయమును కలిగింపనేరదు. ఐరోపాఖండములోని నాగరకరాజ్యములు సదా తమవాక్స్వాతంత్ర్యము, ముద్రణాస్వాతంత్ర్యమును గురించి చెప్పుచుండుట బడాయియని గ్రహింపుడు. అట్టిదేశములలో సత్యమును ప్రకటించుటకు ఎన్నియో ఆటంకములు కలుగును. అయితే నాజాతులను శాంతముగా ప్రబోధించినచో మనకార్యము పూర్తియైనదని తలఁచుడు. మన ప్రబోధములను వారు లక్ష్యపెట్టి విననిచో అయ్యది మనకు అపజయము కానేరదు. వారిదే అపజయముగా గణింపఁబడును. నాసంగతినిమాత్రము చెప్పుకొనుచు ఈవర్తమానమును ఐరోపాలో వెదచల్లితినా నాకు మోక్షము సిద్ధించినటులేయగును. ఈదేశములో నావెంట ఈయుద్దేశ్యము ననుసరించువారు 30 కోట్ల ప్రజలున్నారనుట నాసందేశముయొక్క ఒకభాగమనవలయును. పిదప కర్తవ్యకార్యము ప్రజాబాహుళ్యముదేగాని వ్యక్తికి సంబంధించినదికాదు. ఈప్రకటన వారి సంకు



చితస్వభావముచే అయథార్థముకానీయక చూడఁబడవలయు ననుట వారిదే భారము.

ఐరోపాలో రాయబారవర్గము కార్యాచరణమునందుండగా అఖిలభారతకాంగ్రెసుసంఘము కాశీలోకూడి కలకత్తాలో కాంగ్రెసు ప్రత్యేకసభను మార్చవలయుననియు అందు ఖిలాఫతు సమస్యను ఆలోచించి తీర్మానించుటకు యత్నించెను.

జూనుమాసములో అలహాబాదునందు హిందువులయొక్కయు ముసల్మానులయొక్కయు నాయకులసభ యొకటి కూడెను. ఆసభ్యులలో మహమ్మదీయేతరులయిన హిందూనాయకులు శ్రీ పండిత మోతీలాల్ నెహ్రూ, మదనమోహనమాళవ్యా, బెసంటుసతి, డాక్టరు: సప్రూ, లాలాలజపతిరాయి, చింతామణి మున్నగువారుండిరి. ఏకీభవించి కార్యమును జరుపుటలో అందఱకును మితిమీరిన ఉత్సాహముండెను. ఖిలాఫత్ తప్పిదమును సరిచేయుటకు బలమైన ఆందోళనాపద్ధతిని అవలంబింపవలయునని సూచించిరి. ఖిలాఫత్ కమిటీవారు మహాత్మాగాంధిని తమకు నాయకునిగ ఏకగ్రీవముగా తీర్మానించుకొనిరి. అతని ఏర్పాట్లక్రింద మనఃపూర్వకముగా కార్యములు జరుపుటకు ప్రారంభించిరి.

జూను 22-వ తేదినాడు రాజప్రతినిధిగారికి ఖిలాఫత్తువాంఛితములవిషయమై ఒకప్రకటననుఁ బంపిరి. వారియొక్క వాంఛితముల సయుక్తికత్వమును వైసిరాయిగారు, హోము గవర్న్మెంటు, బ్రిటిషుస్థానికప్రభుత్వమువారిని గుర్తించు

నట్లు చేయలేకపోయినచో తనపదవికి రాజీనామానిచ్చి ఖిలాపతు యుద్యమమును జరుపమని ప్రకటనలో ఉండెను.

గాంధిమహాత్ముఁడు మహమ్మదాలీగారికి ఈ క్రిందిసందేశమును పంపియుండెను.

మహామంత్రిగారు సంధినిబంధనలను మార్చకుండినను, రాజప్రతినిధిగారి కైవశమునసుండు ఖిలాపత్తు ఉద్యమమును అగ్రేసరుఁడై నడుపకపోయినను, 1920 సం॥ ఆగస్టు 1-వ తేది మొదలు సహాయనిరాకరణోద్యమమునకు మహమ్మదీయులు పూనుకొనుచున్నారని దేశములో పలుకుబడిగల గౌరవయుక్తులైన మహమ్మదీయులు సంతకములగుండా తెలిపియున్నారు. నేనున్ను ఆయుద్యమమునందు నాసంబంధమును వివరించుచు దానితో నాభావములను సంపూర్ణముగా నేకీభవించుచు రాజప్రతినిధిగారికి తెలిపియున్నారు. మహమ్మదీయులలో విస్తారమైనవారును, హిందూప్రజాసమూహమును మహమ్మదీయుల మతభావములయొక్క యీగొప్పదియు ధర్మమైనదియు నగు ఆందోళనము వెంబడే మహామంత్రి వాగ్దానములను నిశ్చయపరచునట్లు చేయించుటకు సంసిద్ధులైయున్నారని నేను తలంచుచున్నాను. మనయీతట్టు సాధ్యమైనంత కృషిజరుగుట కేలాటి యభ్యంతరమును లేదు. మనకు మనము ఏవిధమైన సోమరితనము లేక తోడ్పడి కృషిసల్పినచో దేవుఁడును మనకు నిశ్చయముగా తోడ్పడగలఁడు.

రాజప్రతినిధిగారికి పంపినప్రకటనసందర్భమునుగురించి యేప్రత్యుత్తరమును ఇదమిత్థమని రాకపోవుటచే గాంధిమహాత్మునియొక్కయు, ఆమహనీయుని సహకారులయొక్కయు తీర్మానము మేరకు ఆగష్టు 1-వ తేదీనాడు సహాయనిరాకరణోద్యమము ప్రారంభింపఁబడెను.



బిరుదులను, గౌరవపదవులను విసర్జించుటతో ప్రథమమున నిరాకరణోద్యమయుద్ధము ప్రారంభింపఁబడెను. గాంధిమహాత్ముఁడు, హకీంఅజ్మలుఖానుఁడు, సరళాదేవి చౌధరాణి—వీరు ముందుగా బ్రిటీషుదొరతనమువారు తమకిచ్చియుండిన ప్రతిష్ఠాసూచకములైనవానివిసర్జించిరి. నిరాకరణోద్యమముయొక్క ప్రాథమికములును ముఖ్యములునగు సూత్రములలో గవర్నమెంటుబళ్లను, శాస్త్రపాఠశాలలను, న్యాయస్థానములను శాసనసభలను బహిష్కరించవలయుననుట చేరియున్నవి.

ప్రతిరాష్ట్రమునందును సర్కారుబళ్లను శాస్త్రపాఠశాలలను విద్యార్థులనేకులు వదలిరి. కలకత్తా, లాహోరు విద్యార్థులు ఇందు ప్రాముఖ్యమును బడసిరి.

ఆలీఘురు, బనారసుపాఠశాలలను సర్కారుస్వాధీనమును తప్పించుసమస్య ఇప్పుడు గాంధిమహాత్ముని, మహమ్మదాలీగారిని ఆకర్షించెను. ఇదివరలో చెప్పియున్నట్లు ఆలీఘురుపాఠశాలయొక్క విద్యార్థులకును, ప్రొఫెసర్లకును ఆలీసోదరులు పవిత్రములును, పూజార్హములును నగు విగ్రహములవంటివారు. ఈపాఠశాలలయొక్క సర్కారు అధికారమును మహమ్మదాలీగారెంతమాత్రము సహించలేకపోయెను. కావున, గాంధిమహాత్ముఁడును మౌలానా మహమ్మదాలీ గారును విద్యార్థులు కాలేజీని వదలిరావలసిన అవశ్యకతను దెలిపిరి. అక్టోబరు 13-వ తేది

అలీఘరుకాలేజి విద్యార్థులందఱును ఒక్కుమ్మడిగా కాలేజికి పోక నిరాకరించిరి. దేశములో ఉద్యమతీవ్రతాభివృద్ధిలో అలీఘరుపాఠశాలావిషయమందే గాక ఇతరవిషయములును మహమ్మదాలీని ఆకర్షించినవి. ఇప్పుడు మొదలు నిరాకరణోద్యమముతో తానేకీభవించి రాత్రింబవళ్లు దానికిగాను కృషిసలుపుటకు ప్రారంభించెను. నాగపూరుదేశీయమహాసభలోను, ఖిలాఫత్తు, మస్లీములీగుసభలలోను ప్రాముఖ్యతను జెందెను. ఈ మహాసభలలో గాంధిమహాత్మునకు మహమ్మదాలీగారుకుడిభుజమై మెలంగుచుండిరి. నాగపురపుకాంగ్రెసులో తిలకుస్వరాజ్యనిధికి ఒకకోటిరూపాయలను సమకూర్చవలసినదిగా తీర్మానముచేయఁబడెను. ఈజాతీయమహాసభాతీర్మానమును ఫలవంతముచేయు నిమిత్తము మహాత్మాగాంధి, మౌలానాషౌకతాలీ వీర్లతో మహమ్మదాలీగారు చేరి దేశమంతయు గ్రుమ్మరెను. "జనవరిలో నాగపురమునందును పశ్చిమఇండియాలోను సంచరించెను. ఫిబ్రవరి నెలలో మహమ్మదాలీ కలకత్తాలోను తూర్పుఇండియాలోను గ్రుమ్మరెను. మార్చిప్రారంభమున మరల బొంబయిలో సభలను గూర్చి ఉపన్యాసములనిచ్చెను. మార్చిమధ్యమున మరల మన మహమ్మదాలీగారు తనకుప్రియమైనఅలీఘరుకళాశాలలో మరల ఉండుట సంభవించినది. అచ్చోటనుండి జర్మనులో టాలత్తుపాషాగారి ఘోరహత్యవిషయమై ఉపచారవార్తను లండనులో సమీపప్రాచ్యవిషయమైనసభలో పాల్గొనుచుండిన తురుష్కరాయబారవర్గమునకు పంపియుండెను." మహమ్మదాలీపలుకుబడి విశేషము అలీఘరునం దుండినందువలన అచ్చోటి మాజి



స్ట్రేటు మహమ్మదాలీగారు అలీఘరులో ఏవిధమైన ఉపన్యాసములను చేయఁగూడదని వారినోటికి చిక్కము తగిలించెను.

## చరక.

బెజవాడలో అఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశము జరుగగా మహమ్మదాలీగా రచ్చోటికివెళ్లిరి. ఈసమావేశమునందే ప్రాముఖ్యమునుబడసిన సహాయనిరాకరణకార్యక్రమము సభ్యుల సమ్మతిని పొందినది. బెజవాడలోనుండి మహమ్మదాలీ చెన్నపురి కేతెంచెను. అచ్చోటనుండి దక్షిణజిల్లాలకు వెళ్లెను. ఈయన్నిస్థలములలో విద్యార్థులను నిరాకరణోద్యమమునందు చేర్చుటకును, "వారియాత్మశక్తిని శాంతియుతమైన ఈవిప్లవమునందు వినియోగపెట్టవలయును. ఇది రక్తపాతము నెంతమాత్రము కలుగనీయని విప్లవము. ఏదేశములోను ఇట్టివిప్లవము జరిగినట్లు చరిత్రలో కానరాదు. రాట్నమును శరణుచొరవలయును," అని మహోపన్యాసములనిచ్చెను. బెజవాడలోసభాతీర్మానమును అనుసరించి కృషిచేయుటలో ముఖ్యముగా తిలకుస్వరాజ్యనిధికి ధనముగూర్చుట రాట్నమును ప్రజలలో ప్రోత్సహించుట ఈ కార్యములను ప్రజలకు నచ్చచెప్పుటలో మహమ్మదాలీ ఆవంతయైనను ఒడలుదాచక సంపూర్ణమైనమనస్సును వినియోగించెను. ఆమహనీయుని ఉపన్యాసములో రాట్నమును యంత్రపుఫిరంగికి (Machine gun) పోల్చి చెప్పినమాట లీసందర్భమున ప్రస్తాపించినచో సొంపుగా నుండును. "బ్రిటీషుదొరతనమువారికి యంత్రపుఫిరంగులున్నవి. ఆయంత్రపుఫిరంగిని గురిపెట్టి కాల్చినచో 2 వేలగజముల దూరమునుండు శిపాయి

లను చంపఁగలదు. మనయొద్దనో మనపల్లెలలోని విద్రంగులు చేసిన పురాతనమైన యంత్ర మొకటి యున్నది. దీనిని పని చేయించినచో మెరకయనక గుంటయనక సముద్రమనక 7000 మైళ్లదూరము వేగముగావెళ్లి చంపగలదు,” అనియు; 1921 సం॥ ఏప్రెలు నెలలో చెన్నపురియందు గావించిన ఉపన్యాసములో “చెన్నపురియందుండి మనయంత్రమును బారుపెట్టి కాల్చినచో మాంచెస్టరుపట్టణము తప్పక పాడగును,” అనియు చెప్పియుండెను. మరియు “వీనిమూలపరిస్థితులు ఇచ్చుటనున వి.కాంగ్రెసులో చేరకయుండడము మీకు గౌరవహానియని మీరు తలంచువరకును మీస్త్రీలు బంగారుకడియములు, కమ్మలు, ముక్కెరలు, ముక్కుపుడకలు ధరించుట గౌరవహానియని వారెన్నవరకును, అంతేగాక పురుషులపౌరుషము స్త్రీలస్త్రీత్వము భారతదేశము అనాధగానుండువరకు భావింపఁబడక మీయత్నములు సైతము ఫలవంతములుగావు.”

చెన్నపురిలో గావించిన ఉపన్యాసములలో నొక్కదానియందు ఆఫ్గనుదండయాత్రవిషయమున తనభావమును గురించి ముఖ్యమైనవివరణమును దెలిపియుండెను. బేటాలుచెఱసాలలయందుండి తాను వ్రాసిన ఉత్తరములోనిభావములను స్థిరపరచువాఁడై “జర్మనులుగాని, బోల్షివిక్కులుగాని, తురుష్కులుగాని, ఏయితరరాజ్యములవారుగాని మనదేశము మనజనులపై దండయాత్రసలుపుటకు వచ్చి మనవారిని లోఁబఱచుకొనుటకు యత్నించినచో మనము సహాయమును నిరాకరించుటయేగాక ఇండియాలో మనము ప్రతిఘటనము కొనసాగించుట మన



ధర్మము (వినుఁడు, వినుఁడు). ఒకసారి బానిసలమైయున్నాము. మరల బానిసలమగుటకు మన మిచ్ఛగింపఁగూడదు. ఆఫ్గనిస్థానపుప్రజలకుగాని మరియేదేశపు ప్రజలకుగాని ఏలాటి తొందరలను కలిగించని, కలిగించుటకు ఇచ్ఛగించని ఇండియా ప్రజలపై కాబూలుఅమీరు దండెత్తుటకుగాని వారినిజయించి లోఁబరచుకొనుటకుగాని ఇష్టపడక, తనదేశముపై దండయాత్ర సలిపి తనదేశమును స్వాధీనపఱచుకొనవలయునని సదా ధ్యానించుచున్నవారును, మహమ్మదీయమతస్థులకు పవిత్రములైన స్థలములను తమస్వాధీనమున నుంచుకొనియుండువారును, మహమ్మదీయమతమునే తమ ద్వేషభావముచే బిగపట్టి రూపుమాపించవలయుననువారును, ఖిలాఫత్ పీఠమును నానాభీభత్సముగావించి నాశముచేయవలయు ననువారును నగు ఇట్టివారిపై ఆఫ్గను అమీరు యుద్ధము చేయఁబూనుకొనివచ్చినచో మన మాతనికి తోడ్పడుటయేగాక ప్రతిమహమ్మదీయుఁడును తనధర్మముగా భుజములు తట్టుకొని ఇస్లాముమతమునకుగా పవిత్రమైన పోరాటమును సలుపవలసినది అత్యావశ్యకము,” అని నుడివియుండెను.

## స్వరాజ్యనిర్వచనము.

ఈరోడ్డునందు జరిగిన ఖిలాఫత్తుసభకు అధ్యక్షత్వమును మహమ్మదాలీ వహించి తన అధ్యక్షకోపన్యాసమున తనభావము నిట్లు వెల్లడిపరచెను.—

“ఉపన్యాసములనిచ్చుచు దేశదేశములను తిరుగుచుండుటలో ప్రయోజనములేదు. హింసయు, ప్రజాపీడనమే పునాది

గాగల ప్రభుత్వమును మనము సరిపరచలేము; ప్రభుత్వము వారు తమ్మును తామే సవరించుకొనవలయును. వారు తమ్ము సవరించుకొననిచో అప్పుడు మనప్రవేశము అనవసరము. మన మింకొకమారు ఈసందర్భమును వారికేవదలుదము. కాంగ్రెసునందు సంపూర్ణస్వాతంత్ర్య ముండకూడదని నేనే పట్టుపట్టితిని. ఏలననగా: ప్రభుత్వ మేమైనను ఇంకను చక్కఁబడునేమో యనుటయే నాముఖ్యోద్దేశము. ప్రభుత్వము ధ్వంసముకాఁబడవలయునను నుద్దేశ్యముతో దానిని తలక్రిందుచేయవలయునని మన కిష్టములేదు. ప్రభుత్వమువారు విదేశస్థులని మనము వారిని ద్వేషించుటలేదు. ఈప్రభుత్వమే భారతీయులదై ఆ భారతీయులప్రభుత్వమును ఇప్పటిదానివలెనె దుష్టమును పాపిష్ఠమును నగుచో దానిని సైతము ఇట్లే ఇంక నధికముగా ద్వేషింతుము. మనముచేయవలసినముఖ్యకార్యము అదియే. శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు దేశపరిస్థితులు సంపూర్ణముగా పక్వముకాలేదని బెజవాడలో మేము తీర్మానించియుంటిమి. ఏలననగా: పరిస్థితులను పక్వముచేయఁగల ఐచ్ఛికభటులు చాలినంత లేకపోవుటయే దీనికి కారణము. మీలో కడవరకు నిలువగల స్థిరచిత్తులు, పూనికతోను ఉత్సాహముతోను కార్యమును కొనసాగించగల విద్యాధికులుగూడి ఆత్మనిరోధము నభ్యసించినచో భారతజాతికి వెంటనే స్వరాజ్యము సిద్ధించినది. వ్యక్తులకు స్వరాజ్యసిద్ధికాగానే వెంటనే యాజాతికిని స్వరాజ్యము ప్రాప్తించినది. స్వరాజ్యము మీలోనుండగా అది మీవెంబడి యుండినట్టిదియే యగును. వ్యక్తులస్వరాజ్యము జాతియొక్క



స్వరాజ్యప్రాప్తియందు ఫలింపఁగలదు," అని చెప్పి, ఈక్రింది తీరున ఉపన్యాసమును ముగించెను. "మేము మిమ్మును నిప్పులోఁ కాచుటకు మీరు నిప్పులోపడవలయును అని కోరెదము. మీరు చక్కఁగా నిప్పునందు కాలి డాకలిపై పెట్టఁబడగానే నాయకులు మిమ్ములను చక్కఁగా సుత్తెతో కొట్టి యథార్థమైన ఉక్కుముక్కలుగా ఎట్లువంచినను వంచఁబడుటకు సాధ్యములేని వారినిగాఁ జేయుదురు. ఘనమైనవాఁడును, ధైర్యశాలియునగు గొప్పశత్రువును ఎదుర్కొనుటకు ఉక్కుప్రాయముగా మీరు మారవలయునని కోరెదను."

ఈయుపన్యాసముమీఁదనే దొరతనమువారు మహమ్మదాలీపై నేరముమోపి న్యాయాధిపతియెదుటవిచారణకుఁ దెచ్చిరి. దక్షిణమునందుండి ఉత్తరహిందూస్థానములో ప్రతిపట్టణమునందును ప్రజలను బెజవాడకార్యక్రమమునుజరుపుటకు ప్రోత్సహించుచు మహమ్మదాలీ సంచరించెను. ఈస్థలములలో ఆలీసోదరుల ఉపన్యాసము రాజద్రోహకరమనియు, ప్రజలను దౌర్జన్యమునకు ప్రేరేపించునవియనియు తలంపఁబడెను. ప్రభుత్వము భయభ్రాంతమైనది. దేశశాసనమును మీరి నడచినవారని తలంపఁబడినవారి యందఱిపై కఠినచర్య తీసికొనుటకు ప్రభుత్వకార్యనిర్వాహకమువారు తీర్మానించిరి. 'మేల్గాను' అల్లరులు సైతము వీరియుపన్యాసములచే సంభవించినవని ఎన్నఁబడెను.

—గాంధిమహాత్ముఁడు-రెడింగుప్రభువు.—

శ్రీపండితమదనమోహనమాళవ్యాగారిచే ఏర్పాటుచేయఁ

బడి గాంధిమహాత్మునకు రీడింగుప్రభువుభేటి యిప్పుడే తటస్థించినది.

ఈభేటిసందర్భములో గాంధిమహాత్ముఁడు ఎంతనిష్కపటమైనవాఁడనియు, ఆతనియుద్దేశ్యములు ఎంతన్యాయమునందును నిష్పక్షపాతమునందును లోతుబారి వానిపై ఆధారపడియున్నదని రెడింగుప్రభువు తెలిసికొనఁగలిగెను. గాంధిమహాత్ముని పలుకుబడి దేశములో నంత బలీయముగాను ధర్మయుతముగాను ఉండునపుడు నిరాకరణోద్యమమునకు వ్యతిరేకముగ ఎట్టికార్యమును సలుపుట యవివేకమని రెడింగుప్రభువు గుర్తించెను. గాంధిమహాత్ముని నిరాకరణోద్యమప్రకారముగాక, ఆలీసోదరుల ఉపన్యాసములు ఉద్యమమూలాభిప్రాయములను అయథార్థములు గావించునవిగ నున్నవని సందర్భానుసారముగ సూచించెను. ఈయుపన్యాసములు నేర్పుగా దౌర్జన్యప్రేరకములనియు, మిక్కిలి సున్నితమైన న్యాయవిచక్షణముగల గాంధిమహాత్ముఁడు వానిపై దురభిప్రాయపడుట సాధ్యమేయనియు, ఆలీసోదరులకు వ్రాసి, వారిచే ఆయుపన్యాసములలో దౌర్జన్యమును ప్రేరేపించుభావము లేదని యొకవివరణమును సర్కారునకును పత్రికలకును వ్రాయించి బహిరంగపరచునట్లుచేసెను.

## ఆలీసోదరులవివరణము.

“మాకొన్నియుపన్యాసములలో మేము దౌర్జన్యమును ప్రోత్సహించినట్లు మామిత్రులు మాకు దెలిపియున్నారు. మేమిప్పుడు చెప్పఁదలఁచుకొన్న దేమనగా దౌర్జన్యమునకు ప్రోత్సహించుటను మేమెంతమాత్రము ఉద్దేశించియుండలేదు. మాయుపన్యాసభాగములలో నట్టిభావములు పొడసూపునట్లభిప్రాయములు ఏర్పడునని సైతము మేము తలఁచియుండలేదు. మాస్నేహితుల వాదముయొక్కయు వారు మాయుపన్యాసములమీఁది వ్యాఖ్యయొక్కయు బలమును మేము గుర్తించియుంటిమి. మాయుపన్యాసములలోని కొన్నిభాగములపై అనావశ్యకమగు తీవ్రభావములు జనించినందులకు చింతిల్లెదము. మేము దౌర్జన్యరాహిత్య నిరాకరణోద్యమము నవలంబించియుండువఱకు ఇప్పుడుగాని, భవిష్యత్తునగాని, పరోక్షమందుగాని, ప్రత్యక్షమునందుగాని దౌర్జన్యమును ఎంతమాత్రము పక్షీకరించమనియు, దౌర్జన్యమునకు సంసిద్ధమగు వాతావరణపరిస్థితిని జనింపఁజేయుట కుద్దేశింపమనియు, ఇందువలన మాప్రమాణమును గోరినవారికి వాగ్దానపూర్వకముగా దృఢముగా తెలియఁజేయుచున్నాము. మామాటను ప్రమాణపూర్వకముగా దేనికి అడ్డుపెట్టితిమో ఆదౌర్జన్యరాహిత్య నిరాకరణోద్యమముయొక్క ముఖ్యోద్దేశ్యమునకు దౌర్జన్యప్రోత్సాహము యథార్థముగా వ్యతిరేకమైనది.”



ఉద్యమచరిత్రలో ఈమన్ననపత్రము వెలువడుసమయము మిక్కిలి ప్రాముఖ్యతనుపొందెను. ఈమన్ననపత్రముయొక్క అర్పణకు ఆంగ్లోఇండియనులును, కొందఱువార్తాపత్రికాసంపాదకులును “ప్రభుత్వముయొక్కవిజయము.” అనికేకలువైచిరి. సంకలుదట్టిరి. చప్పట్లుగొట్టిరి. కుప్పిగంతులువైచిరి. ఈపత్రము ప్రభుత్వమువారి కొసంగఁబడిన మన్ననపత్రమైనను, గాంధిరెడింగుప్రభువుల భేటి అనంతరము ఇది బయలువెడలినందుచేత ప్రజలలో నిందువలన మాంద్యావస్థ సంప్రాప్తమైనది. రెడింగు

ప్రభువు ప్రభుత్వవర్గము ఈమన్ననపత్రమువలన సంతుష్టిఁజెందినదై ఆలీసోదరులపై నేరముమోపి వారిని మేజస్ట్రేటుముందరకు తెచ్చుటను మానినది. ఆలీసోదరులుమాత్రము ధైర్యముతో తమవిధ్యుక్తధర్మముల నొనరించుచుండిరి. వారు ప్రజలకేగాని, సర్కారునకు ఎంతమాత్రము బాధ్యులుకారు

పిదప కరాచీఖిలాఫత్తుసభాసమావేశ మయ్యెను. ఆఖిలాఫత్తుసభలో "ఇస్లాముమతమునకు శత్రువులుగా నుండువారిని సేవించుట 'హరాం' = పాపము—అనుతీర్మానము ఆమోదింపఁబడెను. ఈసభానంతరము మహమ్మదాలీగారు గాంధిమహాత్మునితో ఉత్తరమునను, ఉత్తరహిందూస్థానమునను సంచారమొనర్చెను.

## నిర్బంధము.

కోటిరూపాయలవసూలు, రాట్నముల ప్రవేశము, కాంగ్రెసుమెంబరులను సమకూర్చుట—ఇవన్నియు నిరంకుశాధికారవర్గమువారిని భయభ్రాంతముగున ట్లొనర్చెను. ఇంగ్లాండులో భారతాభ్యుదయమునకు ఆటంకముగలిగించుచు ఆంగ్లేయాధికారమును భారతదేశములో నిరంకుశముగ జరుపవలయునను సిడన్హేము ప్రభువుకక్షవారు ఈభారతనాయకులనోటికి చిక్కము తగిలించవలయుననియు, వారియొక్క తీవ్రాందోళనములను ఆపవలయుననియు ఘోషపెట్ట మొదలిడిరి. వారిఘోషలు దినదినమునకు మెండైనవి, బలిష్ఠములైనవి. ఇండియాప్రభుత్వమువారు వానికి వంగవలసినవారైరి. భారతనాయకులపై



చర్యలనుజరుపుటకు తీర్మానించిరి. మహాత్మాగాంధితో దక్షిణఇండియాకు సంచారార్థము వచ్చుచున్న మహమ్మదాలీగారిని 14, సెప్టంబరునాఁడు విశాఖపట్టణమువద్ద నిర్బంధించిరి. వెంటనే కరాచీకి తోడ్కొనిపోయిరి. అచ్చటనే విచారణ జరిగెను.

## ప్రాముఖ్యమైనవిచారణ.

మౌలానామహమ్మదాలీగారిని నిర్బంధించినవెంటనే బొంబాయిలో మౌలానాషౌకతాలీగారిని నిర్బంధించిరి. ఇతరనాయకులు డాక్టరు: సయిఫుద్దీను, కిచలూగారు, శారదాపీఠస్థులగు జగద్గురు శంకరాచార్యులవారును నిర్బంధింపఁబడిరి. ఏతీర్మానమునకై ఆలీసోదరులు దోషారోపణముగావింపఁబడి విచారణకు తేఁబడిరో అదియే దేశమంతయు వేలకొలఁదిజనులచే మరలమరల తీర్మానించిచెప్పఁబడెను. కరాచీతీర్మానమును బలపఱచుచు కాంగ్రెసుమహాసభయొక్క కార్యనిర్వాహకవర్గమును, హైందవమహమ్మదీయనాయకులును ఒకవివరణమును ప్రచురించిరి. ఈవివరణమునందు శ్రీయుతులు మహాత్మాగాంధి, పండితమోతీలాల్ నెహ్రూ, సి. ఆర్. దాసు, ఎన్. సి. కేల్కారు, శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులు—వీరెల్లరును సంతకములనుజేసియుండిరి. ఇది ప్రభుత్వమువారికి ఆయాసమును కలుగఁజేసినది. కయ్యమునకు కాలుద్రువ్విన ఈకార్యమునకు దొరతనమువారు మూర్తీభవించినకోపముగలవారైరి. ఆలీసోదరులయొక్కయు ఇతరనాయకులయొక్కయు విచారణ కరాచీలో అక్టోబరుమాసమున ప్రారంభమయ్యెను. ప్రభుత్వముపై శత్రుత్వమును ప్రేరేపించు దోషసహితమైనపత్రి

చేసిరనియు, రాజుగారికి విశ్వాసపాత్రులై రాజభక్తిగలసైనికోద్యోగులను వారిరాజభక్తిని చెఱచుటకు యత్నించిరనియు, నేరారోపణము వారిపై తేఁబడెను. మాజస్ట్రేటు ఈనేరస్థుల నందఱను సెషన్సువిచారణకు జిల్లాజడ్జీయొద్దకు పంపెను.

ఉద్రేకమును అద్భుతమునుగొల్పు ఈవిచారణ కరాచీలో అక్టోబరు 26-వ తేది ప్రారంభింపఁబడెను. జూరీలను నచ్చచెప్పుట, ఉపన్యాసమును ప్రాసిక్యూషనుకు వ్యాజ్యము పూర్తియగువఱకు చేయక నేరస్థులు ఆపియుంచుకొనిరి. సర్కారుతరఫు నేరారోపణసందర్భమున అనేక అక్రమములుండినవి. కొన్నిసాక్షులవిమర్శయైనపిదప కొన్ని నేరములు స్థాపింపఁబడెను. కాంగ్రెసునిబంధనలమేరకు నేరస్థులు తమ్మునుతాము నిర్దోషులుగమాత్రము తెలుపుటకు వారు న్యాయస్థానమునకును దీర్ఘవివరణముల నిచ్చుటకుమాత్ర మిష్టపడిరి. జూరీలను మహమ్మదాలీగారి యుపన్యాసమునందు "క్రౌన్ ప్రాసిక్యూటరుగారు మాపై యారోపించిన నేరములన్నియు ఒక్కటైనను రుజువుకాలేదు. వారు ఆరోపించిన నేరములను ప్రతివాదముచేసి రుజువునకు పూనికొన్నచో వ్యాజ్యము దూసిపోయియుండగలదు," అని నొక్కి వక్కాణించెను. మహమ్మదీయపరిస్థితిని చక్కఁగా గుర్తించగల మహమ్మదీయుఁ డొక్కఁడైనను జూరీలోలేఁడు. 'ఖిలాఫత్తునాయకులుగారు, ఇప్పటిలో ఈవ్యాజ్యమున నేరస్థులు. దైవనిర్మితమైన శాసనమునకు విరుద్ధముగా ప్రవర్తించినందులకు ప్రభుత్వమువారే ఇప్పుడు నేరస్థులై నిందితులుగ విచారింపఁబడుచు



న్నారు. జూరిచాలవఱకు ఆలోచించి నిందితులపై ఆరోపింపఁబడిన కుట్ర నేరములోను, సిపాయీలను రాజభక్తినుండి తొలగించుటకు యత్నించిరను నేరములోను, ఈరెండు నేరములమీద నాయకులు నిర్దోషులనిచెప్పి ఏవో చిల్లరకుచేష్ట నేరములపై దోషులని నిర్ధారించిరి. నవంబరు 1-వ తేది న్యాయాధిపతి తీర్పు చెప్పెను. జూరీలతో తా నేకీభవించితిననెను. వారిపై యారోపింపఁబడిన బలవద్దోషములపై వారు నిర్దోషులనియే తానును భావించితిననెను. చిల్లరకుచేష్ట నేరమునకు వారిపై నేరారోపణను స్థిరపఱచి ఆలీసోదరుల నిరువురను రెండుసంవత్సరములకఠినశిక్షకు పాత్రులనుగ తీర్పుచెప్పెను. శిక్షను వినగానే కోర్టునందు విచారణకాలములో వీక్షించుటకు వచ్చిన ప్రజలు "అల్లాహో అక్బర్" అని శాంతివచనములనుచెప్పిరి.

ఆలీసోదరులు విచారణసమయమందు వారిప్రవర్తన ఆకాలమున వివిధవ్యాఖ్యలకు ఆస్పదమయ్యెను. విచారణకాలములో వారి భయంకరమగు వార్తోచ్చారణము, మల్లచరచుభావములు ఇవన్నియు పిదప కొన్నినాళ్లకే గాంధిమహాత్ముని విచారణసమయమందలి శాంతవాతావరణమునకు విశేషవ్యత్యస్తములుగా కాన్పించినవి. ఇవి వారి సహజస్వభావమునియు, వారిలో దురుద్దేశ్యము లేవియును లేవనియు, సాంఘికమెరుగులను వారెఱుఁగరనియు, మనఃపూర్వకమగు ఉద్యమాచరణములనియు మహాత్మాగాంధియే వక్కాణించియుండెను. కాని, వారిప్రవర్తన కెట్టినిందను ఆపాదించియుండలేదు.

ఆలీసోదరు లిరువురును నిర్బంధావాసమునం దుంచఁబడిన

ఆఱు నెలలకు మహాత్మాగాంధిగారినిసైతము ప్రభుత్వము 6 సంవత్సరములు చెఱసాలయం దుండునట్లు శిక్షించెను.

ఈసోదరు లిరువురును ఇపుడు చెఱసాలయందుండి విడుదలనుబొంది మహాత్మాగాంధిగారిని విడుదలగావించుటకు విశ్వప్రయత్నములుచేయుచున్నారు. ప్రస్తుతము 1914 సం. డిసంబరు 28-వ తేదినాడు జరుగగల కాకినాడదేశీయసభకు మౌలానా మహమ్మదాలీగారు, ఖిలాఫత్తుసభకు మౌలానాషౌకతాలీగారు సభాధ్యక్షులుగ ప్రజలచే ఎన్నుకొనఁబడి ప్రజలగౌరవమునకు పాత్రులై వెలయుచున్నారు. పూర్వము భారతదేశమున పుట్టి పెరిగి తమ అపూర్వకార్యములచే ఆచంద్రార్కస్థాయిగ నెట్లు శ్రీబలరామకృష్ణులు పూజ్యులై వందనీయులైరో అటులే ఈ ఆలీసోదరరత్నములును విలువగల దేశోద్ధారణకార్యములనొనర్చి పూజ్యులును వందనీయులగుటకు బహుకాలము జీవించియుందురుగాక !

అల్లాహోఅక్బర్.

---

# ఆంధ్రగ్రంథములు.

| | | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|---|
| బేతాళునికథలు | | ... | 0 | 8 |
| పరమానంద శిష్యులకథలు | | ... | 0 | 3 |
| వైద్యులకథలు | | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | | ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | | ... | 0 | 6 |
| ఈసబునీతికథలు | 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో | 2-వభాగము | ... | 0 | 8 |
| అరేబియన్ నైట్సుకథలు | | ... | 1 | 4 |
| రేచుక్క-పగటిచుక్క-కథలు | | ... | 0 | 3 |
| మర్యాదరామన్నకథలు | | ... | 0 | 2 |
| షేక్స్‌పియర్ నాటకకథలు | | ... | 1 | 8 |
| పరిహాస్యవినోదకథలు | | ... | 0 | 12 |
| సీతారామము | | ... | 1 | 4 |
| సత్యసేనవిజయము | | ... | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | | ... | 0 | 8 |
| ప్రౌఢవ్యాకరణము | | ... | 0 | 12 |
| హిందీపాకెటుడిక్షనరి | | ... | 1 | 0 |
| హిందీ ఇంగ్లీషు బాలశిక్ష | | ... | 0 | 4 |
| హిందీతెలుగుబాలబోధ | | ... | 0 | 3 |
| సంస్కృత (నాగరిలిపి) బాలశిక్ష | | ... | 0 | 3 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

